# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-10-1981 | సంచిక 24





—* ఈ సంచికలో *—



1—11—81 సంచికలో పారిజాతము, విదూషకపాత్ర స్వరూపస్వభావాలు, భూమిక-నవ్యకవియశోదీపిక, కృష్ణపక్షము-ఒక సమాలోచన, కవి - కావ్యము, శారదరాత్రులు, దినమొల నాగరకత మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 12—00
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.





# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**


## 120 వసంతాలునిండిన తొలితెలుగు స్వతంత్రరూపకము - మంజరీమధుకరీయము

- శ్రీమతి కొలచలమ శారద.

తెలుగునాట తొలితెలుగు స్వతంత్ర రూపకరచనకు శ్రీకారము చుట్టినవారు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు 18 వ శతాబ్ది ఉత్తరార్ధానికి, 19 వ శతాబ్ది పూర్వార్ధానికి, చెందినవారు. 1860 వ సంవత్సరములో వీరు 'మంజరీ మధుకరీయ' మనెడు పేరుగల తెలుగురూపకమును స్వకపోలకల్పితముగా రచించిరి. వీరింకను 'ఉన్మత్త రాఘవాంధ్రీకరణము', శృంగార సుధార్ణవ' మనెడి భాణమును, సంస్కృతమున రచించిననూ, వీరి తొలిరచనమాత్రము, మంజరీ మధుకరీయము.

'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్' అను న్యాయము ననుసరించి, శాస్త్రిగారు వస్తునిర్దేశముతో నీ రూపకము నారంభించినారు. ఇది నాలుగంకముల పరివ్యాప్తమైన నాటకము. వీరి ఈ రూపకరచనకు పూర్వము సంస్కృతాంగ్ల నాటకములు మాత్ర ముండినవి.

శాస్త్రిగారి సమకాలికు లగు కొక్కొండ వెంకటరత్నంపంతులుగారు 'నరకాసురవిజయ వ్యాయోగ' మనెడు నాటకప్రభేదమును 1872 సం॥ లో ముద్రించారు. 'నాటకం, సప్రకరణం, భాణః, ప్రహసనం, డిమః, వ్యాయోగ, సమవాకారౌ, వీథ్యం. కేహా మృగా దశ' అను విభజన ప్రకారము వ్యాయోగము నాటకప్రభేదమై యున్నది.

శాస్త్రిగారు 1860 సం॥ లో మంజరీ మధుకరీయాన్ని రచించినప్పటికీ 1908 వ సంవత్సరమువరకు ముద్రించలేకపోయినారు. అందుచే రచనాకాలమును బట్టి తొలిరూపకమైననూ, ముద్రణ విషయమున మాత్రము ద్వితీయస్థానము నందుచున్నది. కనుక, తొలిముద్రణకర్తలుగా కొక్కొండవారు ప్రసిద్ధులైనప్పటికీ, తొలిరచన మాత్రము, మంజరీమధుకరీయ మనుట నిస్సంశయము. వీరి ఈరచన ప్రప్రథమరూపకముగా పండితులందరూ అంగీకరించిన విషయము. శాస్త్రిగారు ఈ రూపకము రచించిన 48 సంవత్సరముల వరకు ప్రకటింపలేదనిన వీరికి గల కీర్తి కాంక్షారాహిత్యము స్పష్టమగుచున్నది.

నాటకలక్షణము కేవలము సంభాషణాత్మక మనుకొన్నచో 15 వ శతాబ్ది యందలి 'క్రీడాభిరామము' నుదాహరింపనగును. ఏతత్కర్త వల్లభరాయడు. సంస్కృతాంధ్ర భాషలలో క్రీడాభిరామము రచింపబడినది. కాని, ఇందు నాటకలక్షణము లేవియు స్ఫురింపవు. కేవల మిరువురు వ్యక్తులు సంభాషించుటే ఇందు గలదు, కనుక సర్వవిధముల ఇదినాటకప్రభేద మగు 'వీథి'కి చెందును. మంజరీమధుకరీయము తొలితెలుగు స్వతంత్రరూపక మనుట నిరాక్షేపణీయము.

శాస్త్రిగారు తమ రూపకమునందు సంస్కృత నాటకలక్షణముల నధికముగా ఆదరించారు. అంకమంతా ఒకే రంగముగా నుండుట, స్థలకాలైక్యములు పాటింపబడుట, మున్నగునవి వీరు పాటించిన సంస్కృతలక్షణములు. ఆధునికతకు నిదర్శనముగా సంస్కృతలక్షణోల్లంఘన జరిగిన తావు లందందు కానరాకపోవు. సంస్కృతనాటకలక్షణములలో రంగస్థలమున ఆహారవిహారములు నిషిద్ధములు. శాస్త్రిగారీవిషయమున కొంత స్వతంత్రత నవలంబించి, విదూషకుడు ఫలహారముచేయు సన్నివేశము కల్పించినారు. వారి నీ రచనకు ప్రేరేచినవిషయ మిప్పట్లుస్మరణీయము. 1857 లో బొంబాయి, కలకత్తా, మద్రాసువంటి ముఖ్య నగరములలో ఆంగ్లవిశ్వవిద్యాలయములు నిర్మాణమొనరించుటతో ఆంగ్ల విద్యావ్యాప్తి పురోగమించి ఆ ప్రభావము సంస్కృత పండితులపైనీ ప్రసరించినది. తత్కారణమున వీరిలో క్రొత్తఆలోచనలు, ఊహాలు పరిఢవిల్లి, ఆ భాషాసంప్రదాయానుసారముగా తమభాషలో రచనలుచేయవలెనను భావన రూపుదిద్దుకొనినది. అట్టివారిలో ముఖ్యముగా పేర్కొనదగినవారు కోరాడరామచంద్రశాస్త్రి, కొక్కొండ

వెంకటరత్నం పంతులు, పరవస్తు రంగాచారి, వావిలాల వాసుదేవశాస్త్రి, మున్నగువారు.

ప్రస్తుతవ్యాసమున తొలిరూపకమును శాస్త్రిగారిలేఖిని ఎట్లు నడిపినదో స్థాలీపులాకన్యాయముగా పరిశీలింతము.

ఈరూపకము గద్యపద్యాత్మకముగా రచింపబడినది. దీర్ఘము లగు సంభాషణలు ఇందుపొసగించుట వలన ప్రదర్శన కనువు గాదు. భాష క్లిష్టతమముగా నున్నది. శాస్త్రిగారు తమ పాండిత్యప్రకర్ష నడంచుకొనలేక, రూపక రచన చేయవలె నను ఉత్సుకతతో రచించుట వలన ఇందు శైలీ కాఠిన్యము చోటుచేసికొనెనని భావింపనగును. శాస్త్రిగా రిందు విచిత్రకల్పన లెన్నియో చేసిరి. కథా కల్పన, పాత్రపోషణ, పాఠకులలో ఉత్సుకత రేగు విధముగా గోప్యార్థగోపనము చేయుట, మున్నగు విషయములం దీరూపకము ప్రశంసాపాత్రమై యున్నది. ఇందలి దీర్ఘములగుసంభాషణలవలన కథ వేగముగా నడవక, చదువునది ప్రబంధమా? లేక నాటకమా, అను ఆశంకకు తావిచ్చును.

రూపకమున వృత్తములతోపాటు దీర్ఘములగు ద్విపదలు, వచనము, ప్రథమ ద్వితీయాంకముల చోటు చేసికొనినవి. నాయికా నాయకులగు మంజరీ మధుకరులు ఒకరికొకరు తెలియకున్ననూ స్వప్నమునందు రతిసౌఖ్యము ననుభవించి, పరస్పర లగ్నమానసులై వివాహమాడుట ఇందలి ప్రధానాంశము. ఉషాకన్య ప్రద్యుమ్నుల వృత్తాంతము ఈకల్పనకు మూలము కానోపును. స్థూలముగా ఇందలి ఇతివృత్త మిది.

మంజరి అను రాజుకుమార్తె ఆమోద రేఖ అను విదుషీమణికి శిష్యయై సకల శాస్త్రములం దారితేరిన దాయెను. నవ యౌవనవతి యగు మంజరి సౌందర్యపరాజితదేవాంగన. చండయోగిని ఒక క్షుద్ర మంత్రోపాసకురాలు. తనశిష్యురా లగు కల్పవల్లితో, 'మంజరిని విద్యావివాదము నకు పురికొల్పి తర్కరమునఓడించి ఆమె విద్యాగర్వము నడంచి ర'మ్మని ఆదేశించును. కల్పవల్లి చండయోగిని అజ్ఞానుసారము మంజరిని సమీపించి పరిపరివిధముల ప్రశ్నింపగా, మంజరి తన పాండిత్యప్రకర్ష ముప్పిరిగొన వానికి తగిన ప్రతివచనముల నిడి, చివరగా తా నొక ప్రశ్న కల్పవల్లి నడుగును. అది ఏమనగా

'స దూరే తిష్ఠన్ దేవదత్త ఇవ భాతి'- అనువాక్యమందలి అలంకార మేమి? ఇచట దేవదత్త శబ్దము లభేద విషయములగుటవలన ప్రసిద్ధ ఉపమాన అభావమువలన ఉపమ ఉత్ప్రేక్ష లిచట నిరవకాశములు కనుక, ఈవాక్యమున ఏ అలంకారము అర్హమో, తెలుపు మని ప్రశ్నించును. ప్రత్యుత్తరము గోచరింపని కల్పవల్లి 'ఉడుమును పట్టబోయి మహాసర్పముబారి పడ్డట్లయి' దిక్కుతోచక అవమాన భారము మోసికొనుచు తన ఆచార్యకు విషయమంతయు పూసగ్రుచ్చినట్లు తెలిపెను.

కుటిలస్వభావముకల చండయోగిని శిష్యకు జరిగిన పరాభవము తనదిగా భావించుకొని, 'మంజరి మద మణచి నీకు మనోవికాస మొనర్తు నని' బైలుదేరెను. చండయోగిని, ఈర్ష్యాసూయలు పండితమ్మన్యత్వము, బాగుగా గుర్తించిన ఆమోద రేఖ తనశిష్య విజయాభివృద్ధికై ఒక రక్ష కల్పించును. దేవి ఆజ్ఞ లేకపోవుటచేత మంజరికి చండయోగినికి జరుగు చర్చాకాలమున ఆమోదరేఖ తటస్థముగా నుండెను. అంతట చండయోగినీ మంజరులకు విద్యావిషయక చర్చ ప్రారంభ మగును. ఆమె అడిగిన ప్రశ్నలన్నింటికీ మంజరి సదుత్తరము లొసగును. చివరగా, వాచక, లక్షక, వ్యంజకముల అంతర్భేదములను, రసోపస్కారకములైన మాధుర్య, ఓజః ప్రసాదాది గుణముల స్వరూపస్వభావములను, గౌడీ, వైదర్భి, పాంచాలీ, భారతీ, రూపములైన నాలుగు వృత్తులను, నాయికానాయక స్వరూప నిరూపణము, రసస్వరూపము రస, స్థాయిభావములు లక్ష్య లక్షణనిరూపణ యొనర్చుచూ మంజరి చండయోగిని నొకయూపు ఊచును.

ముప్పిరిగొని బైటకు వెడలు ఈర్ష్యాసూయలు ప్రయత్నముపై చండయోగిని అణచుకొనుచు, మంజరికి నూతనవిషయ మొకటి బోధించుచున్నట్లు దోషరహితములు, గుణాలంకార యుక్తంబులగు శబ్దార్థములుకదా కావ్యశరీర మని కావ్య లక్షణము నిరూపింపబోవును. మంజరి అందుల కంగీకరించుచునే 'భగవతి, ఇద్దియ కావ్యలక్షణము. దీన నాకొక సందియం బుదయించె. కేవల శబ్దార్థములు కావ్య స్వరూపమగుచో 'ఈకావ్యము నే చదివితి, దీని అర్థము తేటపడుట లేదు' అని లోకమున చెప్పుట కలదు గదా! శబ్దార్థములు కావ్యశరీరమగుచో పై ఆశంకకు సమాధాన మేమి?' అని తా నెరుగని దానివలె ప్రశ్నించెను. చండయోగినికి మానమే శరణ్య మాయెను. దేవిఆజ్ఞపై రమణీయార్థ ప్రతిపాదక వాక్యము కావ్య లక్షణముగా తగు నని జగన్నాథ పండిత వాక్యమును సోదాహరణముగా మంజరి నిరూపించెను.

చండయోగిని కీపరాజయము మ్రింగ రాని కడిఅయినది. మంజరిని, ఆమె ఆచార్య ఆమోదరేఖను ఎట్లైనకడగండ్ల ముంపవలెనని నిశ్చయించుకొని వెడలి పోవును.

ఇంతటితో ప్రథమ ద్వితీయాంకముల కథ ముగియును.

తృతీయాంకమున సుమతి, సంయమిని అను ఇరువురుతపస్వినుల సంభాషణవలన కథ నడచును. మంజరి మధుకరుని స్వప్నమున గాంచి రతిసౌఖ్య మనుభవించుట, తద్విషయకములగు స్వగతములు, చెలులు విని ఆమె మనోవికారమును గుర్తింతురు.

ఆమోదరేఖ మంజరి, ఉత్సాహముకల్గించుటకై ఉద్యానవనమునకు కొనిపోగా, అచట నొకచిత్రవిచిత్ర మగుకురంగమును చూచి మంజరి దానిని గ్రహింప ముచ్చటపడును. ఎట్టకేల కా కురంగము చేతుల చిక్కును. చెలు లిరువురు దాని సౌందర్యప్రశంస చేయుచుండగా, ప్రచండవేగమున నాహరిణము ఆకాశమార్గమున కెగసి దూసుకొని పోవుచుండెను.

ఆసమయముననే వేట కేతెంచి సరస్తీరమున విశ్రాంతి గైకొనుచున్న మధుకరుడు ఆకాశమార్గమున కురంగ శృంగముల నాలంబనముగాగొని ఆర్తనాదము లిడుచున్న మంజరీ ఆమోదరేఖలను గని కురంగరూపమున ఉన్నవాడు రాక్షసుడని నిశ్చయించి తనవాడి బాణముల అతని నొప్పించెను. తత్‌క్షణము కురంగస్థానమున మహాసురు డొకడు ప్రత్యక్షమై, రాజుతో పోరునకు సిద్ధమై, కుమారికల నిరువురను తనమాయాబలముచే ఒక ఆయసపు పెట్టె కల్పించి అందుంచి ఆకాశమున దూరముగా విసిరి యుద్ధమునకు సన్నద్ధు డాయెను. ఆపెట్టె దైవవశమున మధుకరుని పట్టమహిషి ఉద్యానవన శిఖరమున తగుల్కొని కిందకు జారెను. ఆసమయమున అచటనున్న రాణి ఈవిచిత్రమున కచ్చెరువంది పెట్టె తెఱచిచూచి, అందు దేవతాస్త్రీల వంటి ఇరువురను గాంచి వారివలన విదితవృత్తాంతయై, పిమ్మట, దూరదృష్టితో, వారిరువురు మనుష్యమాత్రుల కంటపడకుండ ప్రత్యేకభవనమున విడిదియించును.

చతుర్థాంకమున మదన బాణ పీడితుడగు మధుకరునికార్శ్యము నివారింప రాణి ప్రయత్నము లొనర్చుచు, యోగినివలన రాజునకు గ్రహ మావేశించె ననియు, తన్నివారణము ఖేచరీదర్శనము వలన జరుగగల దనియు తెలిసికొని రాజు గ్రహబాధానివారణమునకు పేటికనుండి ఖచరమార్గమున ఆవిర్భవించిన కన్యను చూప నిశ్చయించుకొనును.

విదూషకుడు 'కంభ స్తని' అనెడి పరిచారికద్వారా పేటికయం దావిర్భవించిన కన్నెల వయోరూప లావణ్యములు ఆకళించుకొని రాజ అస్వస్థత కందలి చిన్నదియే కారణ మని నిర్ధారించుకొనును. పిమ్మట దేవిఆజ్ఞచే రాజును మంజరిని పూలతోటలో ఒకరినొకరు కానకుండా సమావేశపరచును.

రాజు చిత్రపటమును మంజరి కనుల పడునట్లుచేసి, ఆమె ప్రేమను రాజునకు నిశ్చయ మొనర్చును. రాజుపటమును చూచిన ఆమోదరేఖ అత డట నేయుండవలెనని ఊహించి, రాజునుగని, అతనికి మంజరిపైగల ప్రేమాతిశయము నాతని ముఖతః తెలిసికొని వా రిరువురకు సమావేశము కల్పించును.

ఆసమయమున కట కేతెంచిన రాణి సమీపవర్తులై సరససల్లాపము లాడుకొనుచున్న మంజరీ మధుకరులను గని, క్రోధముతో మంజరిని నిగళ యుగమున బంధించి, వెడలిపోవును. ఆపిమ్మట రాణి తన పినతల్లి యగు శృంగారవల్లివలన లేఖ నందుకొని అందున్న వివరముల వలన, తన సోదరి మంజరి కురంగ రూపరాక్షసునిచే ఆకాశ మార్గమున కొని పోబడుట, తామందరూ అగ్ని ప్రవేశము చేయబోవుచుండగా, సంయమిని ఒకర్తుకచే, మంజరి క్షేమముగా నున్న దనియు, ఏపరాక్రమవంతునిచే ఆమె రక్షింపబడినదో, అతడే ఆమెకు భర్త కాగలడనియు, వ్రాయబడిన జాబునందుకొని, తమప్రయత్నము విరమించుకొని ఆశుభవర్తమానమునకై ఎదురు చూచుచుంటి మనియు తెలిపెను. మంజరి చిత్రపటము నొక బరిణలోనుంచి ఆమెకై దేశదేశములు వెదకించవలె ననియు, మరియొకలేఖను వ్రాసెను. ఆ చిత్రమును చూచిన దేవి అందలి ముఖకవళికలు తాను ఆశ్రయ మిచ్చిన మంజరినిగా గుర్తించి ఆశ్చర్యానందములు పొందును.

రాజునకు, తన సోదరియగు మంజరి నిచ్చి పరిణయమొనర్చి దేవిశబ్దమామెకు, భట్టినీ శబ్దము తనకు అన్వయించుకొనును. రూపక మంతటితో ముగియును.

సమిష్టిపై శాస్త్రిగారిరూపకము సుదీర్ఘములగు సంభాషణములవలన కథ వేగముగానడవక, ప్రయోగఅర్హతనుపోగొట్టుకొనినను, ఇందలి కథా సంవిధానము, మాటపైమాట వేయుచు, విషయనిరూపణ చేయుట, మున్నగునవి ప్రశంసనీయముగా నున్నవి.

శాస్త్రిగారి ఈరచనకు దోహదమిచ్చినవి కాళిదాసాది నాటకములు. మంజరీమధుకరీయమున నాయికానాయకుల సమాగమ సన్నివేశముల కూర్పునందు కాళిదాసు విక్రమోర్వశీయ చ్ఛాయలు, భవభూతి మాలతీ మాధవ సామ్యము నుండుటగమనార్హము.

సామాన్యముగా సంస్కృతనాటకములందు విదూషకునికి ప్రముఖపాత్ర కల్పింపబడును. శాస్త్రిగారీ విషయమును దృష్టి యందుంచుకొని తమరూపకమున విదూషకుని ముఖ్యపాత్రగా తీర్చిదిద్దిరి. విక్రమోర్వశీయమున నాయకుడగు పురూరవునితో మధుకరునకు గల సామ్యమధికము. పురూరవుడు సూర్యునకు అర్ఘ్యమిచ్చి, స్వర్గమునుండి తరలిన నాటి నుండి ఊర్వశీ స్మరణాయత్తచిత్తుడైనట్లు మధుకరుడు వేటకేగిన సమయమున మంజరిని గాంచి మదనాయత్తమానసు డగును.

తిరస్కరిణీ విద్యతో ఊర్వశీ చిత్రలేఖలు రాజుఉద్యాన వనములో ఉండగా ప్రవేశించి రాజు హృదయమును గ్రహించినట్లే, ఆమోదరేఖ సహాయముతో మంజరి

రాజు హృదయమును తెలిసికొనుట అను సంఘటనా సామ్యమును శాస్త్రిగారు తమరూపకమున స్వీకరించిరి.

చిత్రపట సందర్శనము రెండిట గల మరి యొకముఖ్యమగు సన్నివేశ సామ్యముగా గుర్తింపనగును.

శాస్త్రిగారిరచనలో కేవలం సంస్కృత నాటకానుసరణమే కాదు. కొంత ఆధునికతయు కలదు. ఎట్లనగా, నాయికఅగు మంజరి సర్వశాస్త్రకోవిదగా, రసాలంకార శబ్ద శాస్త్రమర్మజ్ఞగా చిత్రింపబడినది. పూర్వరూపకము లందలి నాయికలెవరును శాస్త్ర విషయిక చర్చ లొనరించిన వారు కారు. శాస్త్రిగారినాయిక చండయోగినితో చక్కని శబ్దార్థ విచారమొనరించును. ఈ సన్నివేశము వలన స్త్రీలు బహువిషయశాస్త్రజ్ఞానము కలవారుగా నుండుటను, అవసరమగుచో వారు పలువిధముల చర్చలలో పాల్గొనుటను ఆనాటికి శాస్త్రిగారంగీకరించి ఆదరించినట్లు స్పష్టమగుచున్నది. కాళిదాసాదులనాయికలు కానీ, ప్రబంధ నాయికలు కాని, ఇట్టి సారస్వత చర్చలు చేసినవారు రూపక ప్రబంధములలో కానరారు. ఇది శాస్త్రిగారు ఆధునిక భావములకు చేసిన రూప కల్పన.

ఇట్లు తొలి తెలుగు స్వతంత్ర రూపకమగు మంజరీ మధుకరీయము రామచంద్ర శాస్త్రిగారి లేఖినిలో ప్రాతకొత్తల మేలు కలయికగా భాసించినది. సంస్కృతంలోకోక్తులు, తెలుగునుడి కారము లనేకములు సందర్భోచితముగా అమర్చుట వలన కథకు చక్కని పటుత్వ మేర్పడినది.

— ... —

# ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ

– శ్రీ కాశీ రామచంద్రరావు.

[గతసంచిక తరువాయి]

నృసింహపురాణము ఐదాశ్వాసముల ప్రబంధము. ఇందు 804 గద్యపద్యములు గలవు. ఇది అహోబల నృసింహస్వామి కంకితము చేయఁబడెను.

ఇందు ప్రహ్లాదుని విజ్ఞాన పరిణతుడైన యోగిగా వర్ణించెను. ప్రహ్లాదుడు తండ్రికి గురువులకు దైత్యబాలకులకు గావించిన తత్త్వోపదేశములలో శ్రీమన్నారాయణుని బ్రహ్మముగా నిరూపించెను. 'ఎవడన్నసే, మని తెలుపంగవచ్చు బరమాత్ముని నాతడు మీ సమస్తముల్, వినుము తదేకహేతుకము విశ్వము;జలరుహలోచనుండరయ సర్వశరీరములందు నాత్మయై మెలసినవాడు; మత్సరాదుల నలయదు మహిత మహిత,యేపదంబు మహాయోగి హృదయ గమ్య, మట్టియానంద తత్వంబు ననుభవించు, హరి సమర్పిత మానసుడగు బుధుండు'మున్నగునవి ఉదాహరణములు.

ప్రహ్లాదుని యొక్క గుణాగుణములను విమర్శించితమేని కవి యొక్క అపార శాస్త్రసాంగత్యము పాండితీవిలసనము, సమయోచిత సంభాషణ విశేషము, వినయవిధేయతలు, మున్నగు లక్షణము లెల్ల వెల్లడియగును. ఇఁక ప్రహ్లాదచరిత్రమున ఎఱ్ఱన ప్రహ్లాదప్రతిరూపమే గావున భక్తిరసముదోసిళ్ళకొలది పోసి పాఠకులకు ఆకంఠముగ ద్రావించినాడు. ఎఱ్ఱన కవిత్వము సాత్త్వికసంయమనము గలిగి యౌచిత్య భూతమైయున్నది. ఇందులో వైకుంఠపుర వర్ణనము, బ్రాహ్మణాధిక్య ప్రశంస. హిరణ్యకశిపుని తపోవర్ణన, రాజనీతివిస్తరణ, మునులప్రార్థన, వెన్నెల మరియు వేసవి,మధుపానవర్ణన, లీలావతీ గర్భము, ప్రహ్లాదగీతములు, అహోబల క్షేత్రమాహాత్మ్యము మున్నగునవి కలవు.

ఎఱ్ఱన యసాధారణ ప్రతిభకు నిదర్శనమైనది, మధురభావ పూర్ణమయిన ఈ పద్యము తిలకింవదగినది. లోకవ్యవహారాలను జూపు సంభాషణాధోరణితోను, లోకోక్తులతోను పద్యరచన చేయుట ఒకవిధమైన శిల్పము.

'నీ మగని తేజమున ను
ద్దామశమసముగ్రు డనగ దగి కుంపటిలో
దామర మొలచిన క్రియఁ ద
న్వీమునివిభుడైన సుతుడు నీ |
కుదయించున్.'(3_27)

హిరణ్యకశిపుడు హరిభక్తి రిక్తమానసుడు. ప్రహ్లాదుడు శౌరి భక్తుడు. శమదమాది సుగుణసంపన్నుఁడు. హిరణ్యకశిపుడు తద్విరుద్ధుడు. కావున హిరణ్యకశిపుని కుంపటితోపోల్చుట, ప్రహ్లాదుని తామరతో పోల్చుట ఎంతచక్కగానున్నది. దయావిహీనుడగు క్రూరకర్ముడు, చండశాసనుడు నగు హిరణ్యకశిపుని కుంపటితోను, సహజకోమలుడగు ప్రహ్లాదుని తామరతోను పోల్చుట ప్రశంసనీయము.

ఇందలి జాతీయములు 'చాదిలి మందిలిగాకదుక్క 2_53, పిప్పళ్ళు గూయుచు2_67, తోలితొప్పలఁబెట్టె ననంగుడు 2_74; కలయంగ నడవిలో గాచిన వెన్నెల చెవిటి కూదిన శంఖువిధమున 2_00; పిండలి వండుగాఁ గలగె 4_182; బలవంతపు వెట్టి 5_74; ముసిముట్టక 5_4; కాల్తుర ముడుపోయిన యట్లు 3_62, మీదికి మూరెఁడు వేర్చి' మున్నగునవి జనవ్యవహారమున ప్రసిద్ధములు. తెలుగుపదములకూర్పుతో, జాతీయములతో, లోకోక్తులతో శబ్దాలంకార సౌభాగ్యముతో, రచనాచమత్కారముతో కావ్యోచిత లక్షణములు అటనట కూర్పబడినవి.

ఈతని రామాయణ మిప్పుడు లభ్యము గాదు. 'ఎఱ్ఱనరామాయణము సంగ్రహ రూపముయినదిగాక సకలవర్ణనాపూర్ణ మయిన, సంస్కృత రామాయణాను సారియైన ప్రశస్తప్రబంధముగా తెలియ నగునని శ్రీమాన్. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తెల్పియున్నారు. ఈ గ్రంథము నేడు లభ్యముగా కున్నను నిందలి పద్యములు కొన్ని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమునను, మఱి కొన్ని లక్షణగ్రంథము లందును నుదాహృతములై లభించుచున్నవి.

హరివంశము పంచమవేదమైన మహాభారతమునకు ఖిలము. 'హరివంశస్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞితమ్.' ఖిల మనగా తరువాయి. భారతమునకు కార్ష్ణ వేదమని పేరు. ఇది శ్రీకృష్ణ మహిమప్రతిపాదకముగా నున్నది. మహాభారతంలో కృష్ణచరిత్రవిపులముగాలేదు కనుక ఇదిఖిలము. ఇందులో ప్రధానకథ కృష్ణచరిత్ర. 'భారతపరాంశమనియింపారగ చెప్పుదురు బుధులు 'హరివంశము' అని చెప్పినాడు. భారత కథాంశము హరివంశముతో పూర్తి యగును. అనగా హరివంశ కథాభాగములు మహాభారత సంబంధమైనవి. ఈకథ లేనిచో మహాభారతము సంపూర్ణగ్రంథము కాజాలదు. ప్రబంధపరమేశ్వరుడే ఇందు సర్వతంత్ర స్వతంత్రుడైన శ్రీకృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణ రాజనీతి ధౌరంధర్యములను ప్రశంసించెను. ఇందు శ్రీకృష్ణుని మించిన దైవము లేడని తెల్పియున్నాడు.

ఇందు గోపికలు యశోదతోడ శ్రీకృష్ణుని దుష్ట చేష్టితములను గూర్చి చక్కగా వర్ణించి చెప్పినారు. అదెట్లన 'అసురయెకాక నీతనయుఁడంగన! యేఁబదిబానలందుఁ బొల్పెగెసఁడు వెన్నయుట్ల పయినేఁ బదిలంబుగ డించి, యుండ వెక్కసముగ మ్రింగి బానలను గ్రమ్మనఁ గూలఁగఁద్రోచె నట్టులు; న్వెస నుఱుమాడె నేమిగతి కేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా'(పూ.హ)గోపికలుగృహకృత్యములందు మునింగి యుండు నపుడు పాలు పెరుగు లుండెడి కుండలు చేతి కందనియెడల పీఁటలురోలు ప్రోవిడి యెక్కి కుండలలోని పాల్పెరుగును ద్రాగి వేయును. ఇందు కృష్ణునివి కేవలముకొంటె పిల్లవాండ్ర చేష్టలుగా వర్ణింపబడెను. ఇందు మూలముకంటె అను వాదము పెరిగినది. శ్రీకృష్ణచరిత్రము భక్తి పారవశ్యమున ఎంత పెంపఁబడినదో ప్రాజ్ఞలోకమెఱుగనిదిగాదు. పోతనగారి యశోదకన్న ఎఱ్ఱనగారి యశోద లోకజ్ఞురాలు. శ్రీకృష్ణుని లాలించుటలోను రక్షించుటలోను ఎఱ్ఱన యశోదకు నేర్పించిన పద్ధతియే వేరు. ఈతడు పల్లీజన సదృశహృదయాసక్తుడు. కృత్రిమములగు నాగరక మర్యాదలెఱ్ఱనకు ప్రియములని ఈ గ్రంథమువలన తెలియును. ఇందలిబాణాసుర చరిత్ర ప్రత్యేక ఘట్టము. బాణుడు బలిదైత్యపుత్రుడు. వేయిభుజములు గలవాడు. అసమానబల పరాక్రమ సంపన్నుడు. ఈతని కూతురు ఉష. ఈమె పార్వతీదేవి వరమున పుట్టినది. పార్వతీదేవి ఉషతో వైశాఖశుద్ధ ద్వాదశినాటి రాత్రి సమయమున సమున్నత సౌధతలమునందు నీవు నిద్రించియుండగ కలలోన ఎవడు వచ్చి నిన్ను కలియునో అతడే నీకు మగడగు ననెను. కలలో కలసినాడు అని రుద్ధుడు. మనసు రాకెటువలె ప్రయాణించుచున్నది. దానిని గమ్యాన్ని చేర్చుటమేలా? అందు కుపాయము లేకపోలేదు. మంత్రికుంభాండకుడి కూఁతురు చిత్రరేఖ. ఈమెచిత్రలేఖనములో సిద్ధహస్త. ఈమెకు నారదమహర్షి అఖిలకార్యములకు సాధనముగ తామసి యను విద్యను ఇచ్చినాడు. ఈమెద్వారకకువెళ్ళి ప్రద్యుమ్నుని కుమారుడగు అనిరుద్ధుణ్ణి వసువులు రుద్రులు వాయువు లశ్వినులు మొదలగువారు వెళ్ళరాని శోణితపురమున నిమిషములో ఉషతోచేరుత్తుంది. గాంధర్వ వివాహము చేయించినది. ఎంతటిజాణ.

ఎఱ్ఱన హరివంశమునందు పర్వవిభాగము చేయలేదు. పూర్వోత్తర భాగములని రెండుగాఁ జేసినాడు. ఇందు 4704 గద్యపద్యములుగలవు. చంద్రవర్ణన చక్కని చిక్కని వర్ణన. శంభుదాసునకు చంద్రుడు శేషతల్పశాయి వలె కనిపించినాడట. 'వెన్నెలవెల్లి పాల్కడలి వేఁకదనంబునఁ బేర్చిదిక్కులన్; మిన్నున ముంచి యందు రజనీ కరబింబము కుండలీ భవత్స; న్నగతల్ప కల్పనము భంగిఁ దనర్చెఁ దదంతరంబునన్; వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కయొనర్చెఁ గలంక మత్తఱిన్' నృసింహ 3_87. కవిత్వ గుణములతో జెప్పిన మాధుర్యమునకు దీనికి మించిన పద్యమింకొకటి లేదు. ఆలంకారికులు మాధుర్యమనగా 'చిత్తద్రుతి' అనిరి. కావ్యము వినీ వినుట తోడనే చిత్తము ద్రవించుట రూపమగు ఆనందమే మాధుర్యము. 'సచిత్తద్రవభావమయోహ్లాదో మాధుర్య ముచ్యతే' అని సాహిత్యదర్పణము. హరివంశమునందు నీతిభక్తి ధర్మ ప్రతి పాదకములగు ననేక కథలు ప్రస్తావింపఁబడినవి. ఎఱ్ఱనది పురాణశైలియైనను హరివంశములో మాత్రము అధికముగా కావ్యశైలి కనిపించుచున్నది. 'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్, 'గుణాలంకార రీతిరసోపేతః సాధు శబ్దార్థ సందర్భః కావ్యమ్' అను జగన్నాథ, వాగ్భట మతముల ప్రకారము హరివంశము కావ్యశైలిలో విరచితమని గ్రహింపవలయును. కవి సర్పగారుడమను లక్షణగ్రంథము ఎఱ్ఱన రచనగా నిశ్చితముగా జెప్పుటకు వీలులేదు. ఇతని వచన రచన బహురమణీయము. ఈతని కవిత్వము మృదుమధుర పదగుంభితమై, ప్రసాద గుణోపేతమై, భావబంధురమై, వెలయుచుండును.

—0—

# విశ్వనాథనాయకుడు - నారాయణరెడ్డి కవితా వైశిష్ట్యం

- శ్రీ ధూర్జటి వెంకటబాలాజీ

( గత సంచిక తరువాయి )

కావ్యాన్ని పతాకస్థాయికి తీసుకొని వెళ్ళి నిలబెట్టింది చతుర్థ ఖండం. రాయల ఆజ్ఞపై తండ్రి నాగమనాయనిపైకి దండెత్తి వచ్చిన విశ్వనాథుడు ఊరిపొలిమేరలో ఉండి తాను వచ్చిన వార్తను తండ్రికెఱిగించుట, తుదకు అతనిచేత తిరస్కరింపబడుట జరిగినది. తనభర్తను కొనివెళ్ళుటకు, రాజాజ్ఞను పాలించుటకు వచ్చినాడన్న విషయాన్ని ఎఱింగిన మల్లికాంబ ఆవేదన చెప్పనలవి కాదు. ఏవిధంగానైనా వారి మధ్య సంధికుదుర్చుటకు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. తుదకు తనకు గత్యంతరంలేక భర్తను చేరి యిలా విలపించడం మొదలుపెట్టింది మల్లికాంబ.

'వాడా అజ్ఞానికాడు
పైగా రణ పండితుండు
వానికి లేనట్టి తృష్ణ
వయసుడిగిన మనకెందుకు?
ఆవేశాలకులోనై ఆత్మజుగోల్పోయెదమా?
వేయి చేతులను మ్రొక్కెద
విడిచి పెట్టుడీ రాజ్యము'

'రణపండితుడను ప్రయోగం కవి ప్రతిభను చాటుతుంది. వేయి చేతులను మ్రొక్కెద, అనడంలో కుమారుని పట్ల ఆమెకు ఎంతటిప్రేమగలదో వెల్లడియౌతుంది. తండ్రికన్నను కొన్నికొన్ని విషయాలలో తల్లివ్యక్తంచేయుప్రేమ చాలా గొప్పది. ఆప్రేమకు ఒకసార్థకత, ఒక విలువ, ఒక ఔన్నత్యం ఉంటాయి. మరొకచోట మల్లికాంబ తన ఆవేదనను యిలా వ్యక్తం చేస్తుంది. ఇక్కడ నాగమనాయడన్న మాటలు చాలా స్ఫూర్తిని కలిగిస్తాయి.

'ఎన్నటి వాడే సరిగా
ఇరువదిదేండ్లు నిండలేదు.
ఇంతలోనే తానొక్కని
యంత నని తలంచెనేమొ?
మననీడను పెరిగి తుదకు
మనపైనే కాలు దువ్వె
బుద్ధితీర ద్రావి తల్లి
పొదుగును గుద్దిన యట్టుల'

'బుద్ధి తీర త్రావి పొదుగును గుద్దిన యట్టుల అనడంలో ఒక విశేషముంది. మనంతృప్తితీరాలేక కడుపునిండా పాలు త్రాగి అని ఉపయోగిస్తాం! కాని 'తనివితీరా' అని ఉపయోగించడం కొంతవఱకు సంమజసం. అయితే బుద్ధితీరా త్రావడమనేది కవి ప్రతిభకు తార్కాణంగా పేర్కొనవచ్చును. ఇరువదేండ్లు నిండని వాడుకూడా ఒకనియంత నని పలకడం అనే ప్రయోంగకూడా విశేషంగాచెప్పుకొనవచ్చును.

ఈ ఖండంలో తండ్రీ కొడుకులమధ్య జరిగిన సంఘర్షణ కడు నేర్పుతో చిత్రీకరింపబడింది. ఇరువురూ గొప్ప సంస్కారవంతులే! ఇరువురునూ అగ్రేసరులైన వీరులే! కాని విశ్వనాథుని కొఱకు నాగమనాయుడు స్వార్థపరుడయ్యాడు. విశ్వనాథుడు మటుకు రాజభక్తిని ప్రకటించు సేవాతత్పరుడయ్యెను. ఏది ఏమైనాధర్మానికే కంకణం కట్టబడుతుందన్న విషయాన్ని పరోక్షంగానైనా మనం అర్థం చేసికొనగలము.

ఇక పంచమఖండం కేవలం విశ్వనాథుని రాజభక్తినేగాక,మాతాపితలపట్లవ్యక్తం చేసెడి భక్తినికూడా చక్కగా వ్యక్తం చేస్తుంది. తండ్రిని ఏ విధంగానైనా పట్టి తీసికొని వెళ్ళవలసిన కర్తవ్యం తనకున్నది. కానీ తనకైతాను ఆవిధంగా చేయడం బుద్ధిపూర్వకమైన విషయం కాదు. అందుకు మాతృమూర్తి ఎంతమాత్రమూ అంగీకరించదు. నగరపుపొలిమేరలలో ఉన్న విశ్వనాథుడు నగరంలోపలికి రావడానికి ప్రయత్నిస్తాడు. చివరకుఅంతఃపుర ప్రవేశం చేసిన తరువాత మొట్టమొదటగా అతనికి తల్లికనిపించింది. శోకసంతప్తహృదయురాలైన ఆమెను చూడటంతోనే విశ్వనాథునకు పరిస్థితంతా అర్థమైంది. అతని హృదయంలోని ఆవేదనను కవి ఎంతో నేర్పుగా చిత్రీకరించాడు. అలవిగాని బాధను తనలో ఇముడ్చుకొని బయటకు చాలా గంభీరంగా కనిపించే విశ్వనాథుడు ఎక్కడ తాను భయపడతాడో అనియు వజ్రసంకల్పుడైన తాను ఎక్కడ నీరుకారిపోతాడో అనియు ఆ విధంగా చేయడం తగదనియు తనకుతాను సమాధానపరచుకొంటాడు.

'అమ్మ కంట బడ్డంతోనే వ
జ్రమ్మువంటి మదీయ సంక
ల్పమ్ము నీరై పోవునో యని
ఉమ్మలింప దొడంగె నాతడు
కన్నతల్లియె చూడగోరిన
కాదటంచు నేనెట్లు పల్కుదు
నంచు నందురి తుదకు వచ్చెద
నంచు పంపెను వర్తమానము'

చివరకు తల్లి కంటబడక తప్పలేదు. తల్లికంటబడగానే విశ్వనాథుని ఆవేదన అంతయింతకాదు. చిరకాలంగా నున్న తల్లీ బిడ్డలప్రేమ ఒకసారి కట్టలు త్రెంచుకొని ప్రవహించింది. అసలే మల్లికాంబ తనకుమారుని వదలుకో లేక, భర్తకు ఎదురు చెప్పలేక పరిస్థితులు అనుకూలించక తన ఆవేదనను ఎటూ వ్యక్తం చేయలేక కుమిలిపోయే సమయంలో కుమారుని ఆగమనం ఆమెకు మరింత దుఃఖాన్ని కలుగజేసింది. తల్లిని చేరిన విశ్వనాథుడు తాను ఏవిధంగా విలపించేదీ కవి యిలా యిలా వర్ణిస్తాడు.

'ఎడద చుమ్మలు చుట్టగా దుః
ఖించకమ్మా కొడుకునై మీ
కిట్టి రాయిడి పెట్టినందుల
కెంతయో లజ్జింతునమ్మా!

మనిషిగానే యేల జన్మ
మ్మందితిని? ఏపుట్టగానో
చెట్టుగానో పుట్టి యుండిన
చిక్కులుండక పోవునమ్మా!
పుట్టితిని పో! ఏల నాచే
బట్ట గట్టించితిరి? పైగా
చదువ జేసితి రెండు కితిహా
సమ్ములను శాస్త్రాదికములను'

పుత్రోత్సాహము తండ్రికి పుత్త్రుడు జన్మించినపుడు గలుగదు జనులా, పుత్త్రుని కనుగొని పొగడగ ...' అనేపద్యం అక్షరాలా నాగమనాయనిపట్ల అన్వయిస్తుంది. నాగమనాయడు తనకుమారుని అలా తీర్చిదిద్దాడు. ఒక ఉత్తమ వీరునకు ఏయేలక్షణా లుండవలెనో, ఆ లక్షణాలన్నీ తన కుమారునిలో ఉండేటట్టుగా ప్రయత్నించి అందులో సఫలీకృతుడయ్యాడు. తుదకు ఆ ఉత్తమ లక్షణాలతో కూడు కొన్న సంస్కారమే విశ్వనాథుని జీవితానికి గొడ్డలి పెట్టయ్యిందనేనగ్న సత్యాన్ని తన తల్లికి తెలియ చెప్పాడు. అంతేకాకుండా పంచమఖండం ఉత్తరార్థంలో హేయమైన రాజ్యం తనకు వలదని పలుకుచు ఇలా అంటాడు.

'అక్రమముగ గడియించిన
అమృతమ్మైనను హేయము
ధర్మస్థాపనకు కన్న
తండ్రి కెదురు దాకినందు
కెట్టి పాప మైననన్ను
చుట్టనీ అనుభవించెద.'

ఈవాక్యాలలో విశ్వనాథునకు ధర్మంపట్ల ఎంతటి మహోన్నతమైన గౌరవాభిమానా లున్నాయో మనకు తెలుస్తాయి. ఈసత్యాన్నే చివరివరకు తెలుసుకోలేకపోయాడు నాగమనాయడు

ఇక కావ్యాన్ని పతాక స్థాయికి తీసుకొని వెళ్ళదగింది షష్ఠఖండం. ఈ ఖండంలోనే కావ్యానికి సంబంధించిన ముఖ్యమైన అంశాలన్నీ ప్రస్ఫుటమౌతాయి. రాజాజ్ఞను ధిక్కరించిన, నాగమనాయని పట్టి తెచ్చిచ్చిన విశ్వనాథుడు నిండు సభలో అందరి ముందు ప్రవేశపెట్టుట రాయలు తగురీతిగా అతనిని శిక్షించుట తుదకు అందరి సమ్మతిమీద రాజ్య కాంక్షలేని విశ్వనాథునకు పాండ్యరాజగు చంద్రశేఖర పాండ్యుడు మొదలగు వారు రాజ్యాన్ని కట్టబెట్టుట, అనుకొన్నరీతిగా నాగమనాయని కోరిక నెరవేరినను పశ్చాత్తప్తుడై ఆతడు అందరి ముందు అవమానాన్ని పొందుట మొదలగు అంశాలు యిందులో పేర్కొనదగ్గవి. తండ్రి నాగమనాయని పట్టి తెచ్చిచ్చిన సందర్భాన రాయల సభ యంతయు ఎంతో నిండుగా ఉండెను. మొహంలో కత్తివాటుకు నెత్తుటిచుక్కలేని నాగమనాయడు ఒకవైపున శిరస్సును వంచి యుండగా అతనిని పట్టి తెచ్చిన విశ్వనాథుని గౌరవ పూర్వకంగా రాయలు ఆదరించి సభలోనికిఁ గొనితెచ్చిన ఘట్టాన్ని కవి యీవిధంగా చిత్రీకరిస్తున్నాడు.

'రాయలతో విశ్వనాథ
నాయడు నడయాడుచుండు
సురసభలో ఇంద్రునితో
నరుగు పార్థు డనిపించెను'

రాయలకు సహజంగా విశ్వనాథుని పట్ల పుత్త్రవాత్సల్య ముంది. అందువల్లనే అతనిని ఇంద్రునితోనూ, విశ్వనాథుని అర్జునునితోనూ పోల్చుట జరిగింది. సభనుద్దేశించి కృష్ణదేవరాయలు ప్రసంగిస్తూ నాగమనాయడు తనకు తీవ్రద్రోహం చేసినను, తను అతనిని మన్నించుటకు కేవలం అతడు విశ్వనాథుని తండ్రి యగుటయే ప్రధాన కారణ మని చెప్పెను. సభ యంతయుఆనందించగా, నాగమనాయడు వినమ్రుడై ఉండిపోయాడు. తరువాత రాయలు దక్షిణ దేశాధీశునిగా నియమించుటకు విశ్వనాథుడు మటుకు అంగీకరించలేదు. తుదకు చంద్రశేఖర పాండ్యుడు మిగిలిన వాళ్ళందరూ ఒత్తిడి చేయగా ఎట్టకేలకు అంగీకరించెను. దీనితో కావ్యం పరిసమాప్తమౌతుంది.

కావ్యం మొత్తంమీద మనకుస్పష్టంగా కనిపించేది విశ్వనాథుని పాత్ర చిత్రణము. ఒక మహావీరునకు ఒక మహాసంస్కారవంతునకు ఉండవలసిన లక్షణాలన్నీ ఆతనిలో ఉండడం చేత అతణ్ణి అందరూ ఆదరించారు. అతనిపట్ల ఎనలేని ప్రేమాభిమానాలను వ్యక్తం చేసారు.

ఈకావ్యంతో సంబంధించిన పాత్ర ఒకటుంది. అది విశ్వనాథునితల్లి మల్లికాంబది. చరిత్రలో ఆమె ఎవరో, ఆమె ప్రాముఖ్య మేమిటో తెలియదు. కానీ ఆమెకు ఒక విలువైన స్థానమిచ్చి ఆమెను మహోన్నతంగా దిద్దితీర్చిన ఘనత నారాయణరెడ్డిగారికి దక్కింది.

శృంగారాత్మకమైన కవిత్వాన్ని అల్లడానికి అలవాటుపడిన నారాయణరెడ్డిగారు దీనిని వ్రాయడం ఒకవిశేషం! అంతేకాకుండా వీరరసంలో మిగిలిన భాగాలైన దానధర్మదయావీరాలు బాగా పోషించబడ్డాయి. అన్నింకటింటే కవి వాడిన ఉపమానాలు, విలువైన సమాసాలతో కూడిన భావధార, పాత్రలమధ్య కూర్చిన విలువైనసంభాషణలు పాత్రలను దిద్ది తీర్చిన తీరుతెన్నులు కావ్యాన్ని పతాకస్థాయికి తీసుకొని వెళ్ళాయి.

ఒకప్పుడు నారాయణరెడ్డి గారిని తలచుకొన్నప్పుడు నాకు 'కర్పూరవసంతరాయలు, నాగార్జునసాగరము, కాంతిదూత' వంటి కావ్యాలే గుర్తుకొచ్చేవి. కానీ అవి నా స్మృతిపథంనుంచి తప్పిపోయినా యీనాడు నాలో శాశ్వతంగా నిలిచిపోయిన కావ్య మీ 'విశ్వనాథనాయడు.'

— ... —

# పిరదౌసి - పాత్రచిత్రణ

- శ్రీ పి. మాలకొండయ్య, ఎం. ఏ.

సంస్కరణ కవిగా ప్రసిద్ధిగన్న జాషువా కృతుల్లో 'పిరదౌసి' యెన్నదగింది. ప్రభుత్వ దురహంకారాన్ని ఎట్టయెదుటే నిరసించడం యిందులో ప్రతిపాదింపబడింది. చరిత్రలో అన్నికాలాల్లోను ప్రభుత్వదురహంకారం యెన్నోరకాలుగా వ్యక్తమౌతుంది. గడచిపోయిన యుగాలనాటి చరిత్రను తిరిగి పుట్టించే సమర్థుడు కవి. ఈకావ్యంలో ప్రధానమైన భూమికలు గజనీమహ్మద్ పిరదౌసీలు ఏనాటివారో? ఏనాడో కాలగర్భంలో కలిశారు. కాని ఆ పాత్రలు ఎన్నటికీ నవీనాలు. వారికి వరుసగా అపకీర్తి, కీర్తి, కలిగాయి. ఒకడు మైమరపుహుక్కాత్రావు సుల్తాను. మరియొకడు తమ్మిచూలి కేలు తమ్మిని గల నేర్పును తనకలంలో చూపి యీశ్వరత్వాన్ని పొందిన సుకవిరాట్టు. మొదటివాడు కృతఘ్నుడు. రెండవవాడు కృతజ్ఞుడు. పిరదౌసి రాజు తలమీద కప్పురము చల్లినవాడు. రాజు సుకవితలమీద నిప్పుకలు విసరినవాడు. కవి సాధు స్వాంతుడు. రాజు దుష్ట స్వాంతుడు. ఈ విధంగా పరస్పర విరుద్ధ గుణాలు కల్గిన పాత్రలు ఇవి రెండూ.

దురంత వేదనతో తన హృదయం ఆక్రోశిస్తే జాషువా దానికి అక్షరాకృతి కల్పించాడు. అనేక ఘట్టాల్లో కలిగిన భావతీవ్రతను సంయమనబుద్ధితో ఆవిష్కరించాడు. అనాదిగా కవికి కలుగుతున్న అన్యాయం పిరదౌసిపాత్రద్వారా వ్యక్తమయింది. కవికుండే ప్రతిభ, కవిత్వానికుండే శక్తి,యిందులో నిరూపింపబడ్డాయి. ఈకావ్యసృష్టికి సమకాలీన, నిత్యజీవితంలో ఎదురయ్యే సంఘటనలు గూడా జాషువాను ప్రేరేచివుంటాయి.

అందుకే 'పెరుగుతోటకూర విఖ్యాత పురుషులంతా కవిని వ్యర్థజీవిగా భావిస్తా'రంటాడు. ఈవిఖ్యాత పురుషులే దాశరథిగారి మాటల్లో 'కలంబలం తెలియని కఱకురక్కసులు, నెత్తురుత్రాగి జీవించే నిర్దయులు'. ఆ కోవలోనివాడే గజనీ మహమ్మదు. ఇంకా యిలాంటి అపరగజనీలు సమకాలీన జగత్తులో ఎందరో.

కవిత్వానికి ప్రభుత్వంచేసినఅన్యాయం పిరదౌసిలోని యితివృత్తం. గజనీ హిందూదేశానికిచేసిన అన్యాయంతో ఈ కావ్యం మొదలౌతుంది. గజనీ హిందూ వైభవాన్ని కైవసంచేసి కొన్నాడు. ధనరాసులు కదిలించుకొని గజనీచేరాడు. భారతీయుల దేవాలయాలన్నీ గజనీపురంలో మసీదు లయ్యాయి. ఆ మసీదులన్నీ కాలగర్భంలో యేమౌతాయో అంటాడు జాషువా. హిందువుల భుజబలాన్ని ఆశ్రయించి వుండే సంపద తురకభూపతి ఖడ్గాన్ని వలచింది. ఈ సందర్భంలోకవి 'సిరి నిజమ్ముగ వట్టిటక్కరిది సుమ్ము,' అనే అర్థాంతరన్యాసంలో లక్ష్మీచాంచల్య స్వభావాన్ని అభివర్ణించాడు. కలిమి ఎప్పుడూ బలిమికే వశమౌతుంది.

తన కెదురులేక, ధనానికి కొదువలేక, శత్రుసమూహాన్ని కనుమూయనీక దుష్టస్వాంతుడై రాజ్యమున పెత్తనం చెలాయిస్తుంటాడు గజనీ. దిగ్దంతుల పదహారు దంతాలకూ తనపద్దనిమిది విజయాల్ని కలుపుకొనేట్లుగా నగరివాకిట్లో వుండే ఏనుగు రెండుదంతాలమీద తనచరిత్ర రాయించుకొంటాడు. కత్తులపై భటులకు బిరుదాలు చెక్కించి, సేనాపతుల్ని బనీగారు శాలువాలతోను, కంకణాలతోను, పచ్చలపిడికిళ్ళతోనూ సన్మానించి తనవైభవాన్ని చాటుకొంటాడు.

ఇంతటితో ఆగక తనవిజయాలకు అమృతత్వం కల్పించాలనుకుంటాడుగజనీ. పారసీకకవికుల తిలకుడైన పిరదౌసిని రప్పించి 'షహనామా' గ్రంథరచన చేయవలసివదిగా ప్రార్థిస్తూ కర్పూరతాంబూల మిస్తాడు. ఇచట జాషువా కవినిగూర్చి, అతనిశక్తినిగూర్చి తెలుపుతాడు. 'కవిని కన్నతల్లి గర్భమేధన్యం.' కృతిని పొందువాడు మృతుడు గాడు. కవిశక్తి అపూర్వమైనది. బ్రహ్మచేతినైపుణ్యం అతనికుంది కాబట్టి యీశ్వరత్వం చెల్లుతుంది. గడచిన క్షణం మరలింప నశక్యం. అట్టి అసంభవవిషయాన్ని సంభవంచేయగలశక్తి, నేర్పు, కవికలంలోనే వున్నవి. అందుకనే కవి నిజమైన పూజనీయుడు. ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్కబంగారు రూకయిస్తా నని మక్కామసీదుతోడుగా సుల్తాను చేసిన వాగ్దానానికి పిరదౌసి హృదయాన నిసర్గ కవిత ఆవిర్భవించింది. ఆతడు గ్రంథరచనకుపక్రమించాడు.

గజనీ దండయాత్రల్ని వర్ణించడంలో వీరరసం పోషింపబడింది. ఈ ఘట్టంలో వుండే హైందవజాతీయత, భావకవితలో వుండేదేశభక్తినిసూచిస్తుంది.కవినిగూర్చిన అభిప్రాయాలు తెల్పడంలో జాషువా ఆత్మీయతాముద్ర వుంది.

పారసీక గ్రంథభాండాగారాన్ని శోధించి రత్నాల్లాంటి అరవై వేలపద్యాలతో ముప్పైఏళ్ళకు గ్రంథరచనపూర్తి చేసి రాజునొద్దకు తీసుకొస్తాడు పిరదౌసి దాన్నిపఠించగా సభాసదులంతా అమోదించారు. పిరదౌసి యింటికి వెళ్ళాడు రాజు తన మునుపటివాగ్దానాన్ని లెక్కచెయ్యకుండా పసిడినాణాలకు బదుల వెండినాణాలు పంపుతాడు. రాజు ఊ[illegible]మింపలేని కృతఘ్నుడు అయ్యాడు. ఈ కృతఘ్నత్వానికి కవిహృదయం కుమి[illegible]పోయింది. ఎన్నోకొండలు తన గుండెలా కరగిపోయాయి. నిందాసహోక్తికంగ

రాజుకు ఒక ఉత్తరం రాశాడు.అధనాన్ని మరలించి పంపాడు.

ఈ లేఖ పిరదౌసి ఇతివృత్త సంవిధానానికి ప్రాణంలాంటిది. ఆవేశంతో హృదయం ఆక్రోశిస్తే తప్ప అలాంటి భావాలు ఏకవికలంలోంచీ వెలువడవు.

గజనీవాగ్దానం కృతకవిద్యుద్దీపకాంతిలో తాను ఆశాసౌధాన్ని నిర్మించుకొన్నాడు. ఆక్షణికమైన విద్యుద్దీపం తన వెలుగును కోల్పోయింది. కవి ఆశాసౌధం కూలిపోయింది. తాను వ్యర్థమైన ప్రయాసతో ఈదుఃఖాక్రాంతలోకంలో వొంటరిగా మిగిలిపోయాడు. తనది స్వయంకృత దోషంగాగుర్తించాడు.తనకలంలోవిషాద గీతికలు వ్రాసుకోడానికే సిరా మిగిలి వుంది. వయఃపటుత్వం సడలింది. తన ముప్ఫైయేండ్ల సేవకు నిరాశాబాష్పాలే ఫలితమయ్యాయి. ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క నెత్తురు బొట్టు ఆవిరైంది. ఈవిధంగా వాపోతూవుండే సందర్భంలో

'అల్లాతోడని పల్కినాపసిండి కా
వ్యద్రవ్యమున్ వెండితోఁ
జెల్లింపన్ సుఖమే? మహమ్మదు నృపా
లా! సత్యవాక్యం బెవం
డుల్లంఘింపఁడో వాఁడెపో నరుఁడు ధ
న్యుం డిద్ధరామండలిన్.'

అనివ్రాసిన పద్యంలో సత్య వాక్యోల్లంఘనం యెంతపాపమో తేటపరచాడు. అసత్యవాదిచే పూజితుడైన భగవంతునికి కూడసుఖంలేదన్నాడు. సత్యవాక్యాన్ని అనుసరించినవాడే మనిషి అన్న సత్యాన్ని యిక్కడ ప్రతిపాదించాడు. వ్యధాక్షుభిత కవి హృదయాన్ని జాషువా తన హృదయంనుండి స్వయంవ్యక్తమయ్యేట్లు చేశాడు. పిరదౌసి తన శిరస్సున నశింపని అగ్నికణాల్ని పోసికొన్నాడు.

ఈలేఖలో ప్రభుత్వ దురహంకారానికి మోసపోయిన కవిహృదయం వ్యక్తమౌతుంది. లేఖను చదువుకొన్నరాజు పిరదౌసిని పట్టిచంపు డని ఆజ్ఞాపించాడు. రాజిచ్చిన తృణమోపణమో గ్రహించక పారసీకుడు కాఱులు కూసె నని, యీ పాటి కవిత్వము ఇంకెవరు రాయలేరా అని, అచటిపండిత బ్రువులు అనుకొన్నారు. ఈఅంశం సమకాలీన కవుల్లో వుండే మాత్సర్యాన్ని సూచిస్తుంది. 'ఏ, గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే గదా.' అన్న చేమకూరవేంకట కవిగారి మాటలు ఈ సందర్భంలో గుర్తుకొస్తాయి. కవీంద్రునివేడి రక్తధారాపాతం అమంగళకరం అనే మాటల్లో కవి గౌరవం తెలుస్తుంది. అరవైవేల నాణాలు ఈదీనుణ్ణి వధించడానికి అరవై వేలబాణా లయ్యాయి. పిరదౌసి ముఖాన పిన్ననినవ్వు వుదయించిం దట. ఈ నవ్వు వైరాగ్య చింతనలో నిరాశాకిరణంలాంటిది. పైని భగవంతుడున్నాడో లేడో అనే సందేహాన్ని కలిగించేటటువంటిది.

మసీదు గోడపై వేకువజామున నమాజుకొచ్చే భక్తుల శరీరాలు జలదరించేట్లు యీరెండుపద్యాలు వ్రాస్తాడు పిరదౌసి.

'కృతియొక బెబ్బులింబలె శ
రీర పటుత్వము నాహరింప, శే
షితమగు నస్థిపంజరము
జీవలవంబున నూఁగులాడఁగా
బ్రతికియుఁజచ్చియున్నముది
వగ్గు మహమ్మదుగారి ఖడ్గదే
వతకు రుచించునా? పరిభ
వవ్యథయింతట నంతరించునా?

'ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెక్కమాఱులు మున్కలు వేసినాఁగ
భాగ్యహీనుఁడ ముత్యమ్ము వడయ నయతి
వనధి ననుమ్రింగ నోరువిచ్చినదితుదకు.'

తరువాత పిరదౌసి తనభార్యను,కుమార్తెను వెంటదీసికొని భయంకరమైన అడవిగుండా ప్రయాణిస్తున్నాడు. ఈసందర్భంలో ప్రకృతివర్ణనలు. దైవత్వాన్ని గూర్చిన పిరదౌసి భావాలు వున్నాయి. చీకటి కాగా వారి కొక బోయ వాడు కొంతదూరం దారి చూపాడు. అతనియందు స్నేహార్ద్ర మనస్కుడైన పిరదౌసి తనవిషయాన్ని కొంత తెలియపరచి అతనికి కృతజ్ఞతలు పలికి ముందుకుసాగి తూసునగరాన్ని చేరాడు.

గజనీభటులు పిరదౌసి జాడ తెలియక వెనుదిరిగారు. వృద్ధుడైన గజనీవారిని మాటలతో దండించి పిరదౌసికి ఎవడు శరణు యిచ్చునో అతడు నాకు శత్రువు అని చాటించాడు.

ఏవం విధప్రభుత్వ దురహంకారాన్ని మిగిలిన రాజులందరూ నిరసించారు. కొందరు సామంతులూ మండలించే విధంగా లేఖలురాశారు. 'నీకీర్తిని మృతిలేని కృతులలో పొదివి పూజించి యిచ్చిన పిరదౌసిని సంతోషపరచవలెనా? లేక యిట్లు నిరాశలో ముంచవలెనా! కృతిద్రవ్యము నీ హుక్కాఖర్చుకు సాటిరాదు.కృతికన్య తుష్మారాజ్యకన్యకన్న చక్కనిది. నిండుకొలువున కవులకన్నీరు తగదు' అని. ఈ లేఖల సారాంశం గజనీలో మార్పు కలిగించింది. మూడేండ్లు తాను పండిత గోష్ఠిలో గడిపాడు.

ఒకనాటి వుదయాన గజనీ మసీదుకు పోయి ప్రార్థనజరిపి తిరిగివస్తూ, మసీదు గోడపై పిరదౌసి వ్రాసిన పద్యాల్ని ప్రత్యక్షరమున అశ్రులు ప్రత్యక్షమయ్యేట్లు చదివాడు. అంతఃపురానికి వచ్చి పిరదౌసి కిస్తానన్న అరవైవేల బంగారు నాణాలను ఆరు ఒంటెలమీదవేసి పిరదౌసికి యిచ్చిరం డని భటుల్నిపంపాడు అక్కడ పిరదౌసి ఏడాది నుంచీ వార్ధక్యంలో దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. కుమార్తె సపర్యలు చేస్తున్నది. క్రమంగా కవి తనువు చాలించాడు.గజనీ పంపిన బంగారునాణాలు అదే సమయంలో అక్కడికి చేరాయి.

‘సుకవిదేహంబు ప్రేతభూమికి లభింప
అర్థమప్పుడె శూన్యగేహమును జేరె,
నిమిష భేదంబు నడుమ సంధింపఁబడిన
ఈరహస్యంబుఁ గనుఁగొన నెవరితరము?’

ఒక్క నిమిష భేదంలో పిరదౌసి శ్మశానాన్ని, అర్థం శూన్యగేహాన్ని చేరడం జరిగింది. నిమిష భేదంలో వున్న యీరహస్యం యెవ్వరికీ తెలియదు. పిరదౌసి కూతురు తనతండ్రినిచంపిన యీధనాన్ని ముట్టలేదు. సుల్తాను భటులు ధనాన్ని మరలించుకొని యీవిషయాన్ని గజనీకి నివేదించిచారు. గజనీ తన కొలువు చాలించి తన మందిరాన్ని ప్రవేశించి యీసంఘటనకు పశ్చాత్తప్త హృదయంతో కుమిలిపోయాడు. పిరదౌసి పేరుతో తూసుపట్టణంలో కవిఋణాన్ని తీర్చుకోడానికి చక్కని ఒకసత్రశాల కట్టించాడు నవాబు.

కవీ,రాజూ యిద్దరూ చరిత్రలో నిల్చిపోయారు. కవికి మంచీ, రాజుకు చెడూ మిగిలాయి. జాషువా పిరదౌసి కావ్యంలో వ్యక్తంచేసిన వ్యక్తులమధ్య గల తేడా యిది. పాత్రలకు పాఠకుల మనఃఫలకం మీద రూపు రేఖలు దిద్దాడు. ఇతివృత్తాన్ని కూర్పుచెయ్యడంలో జాషువా నేర్పు మనకు తెలుస్తుంది.

—...—



# సాహిత్యంలో కార్మికుడు

- శ్రీ చింతలపూడి వేంకటేశ్వరులు, ఎం. ఏ.

బ్రాహ్మణుణ్ణి, శూద్రుణ్ణీ, ఆవునీ, కుక్కనీ, అన్నిటినీ సమభావంతో చూడగలిగినవాడే పండితుడు అంటాడుభగవద్గీతలో శ్రీకృష్ణుడు. ఆయన చెప్పినట్లే కులవ్యవస్థ(పూర్వజన్మ?)గుణకర్మలను బట్టి కనుక బ్రాహ్మణుడంటే విజ్ఞానవంతుడు లేక చదువు కున్న వాడు అనీ, శూద్రుడంటే కార్మికుడనీ అర్థం తీసుకుంటే వర్ణవ్యవస్థ సంఘాన్ని గుప్పిట పెట్టుకున్న రోజుల్లో వర్ణసామరస్యంఅంటే యిప్పటి మాటల్లో వర్గసామరస్యం స్థాపించబడిందనే విషయం తెలుస్తోంది. ఆవ్యవస్థలో అట్టి సామరస్యం సాధింపబడబట్టే ఏపౌరాణిక గాథలోనూ కుటుంబసమస్యలు తప్ప కులాలమధ్య గొడవలు కనిపించవు.

అయితే ప్రశాంతమైన తటాకంలో ఏనుగులు, మొసళ్ళు, చేరి పోరాటం మొదలుపెట్టాయి. చెదరిపోయిన సంఘానికి ఓదారికావాలి. మహారణ్యంలో దారి తప్పినవాడికి ఎటు పోతే గమ్యం సిద్ధిస్తుందో ఎలా తెలుస్తుంది? సాహిత్యం సంఘ నిష్ఠమైనది. కాబట్టి సంఘానికి దారి చూపించే బాధ్యత సాహిత్యంమీద పడింది. సాహిత్య కారులుకూడా దారి తప్పిన పౌరులే కాబట్టి పారుగువాళ్ళని చూచి వర్గపోరాటం ఆయుధంగా ప్రకటిస్తున్నారు. ‘భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే’ అనే హితోక్తులు విస్మరించిన యీ సమాజంలో మళ్ళీ కణ్వులు పుట్టే వరకు కార్మికుడికి సరైనదారి కనిపించదు. ముప్పాళరంగ నాయకమ్మ గారి దృష్టిలో హనుమంతుడు వెట్టిచాకిరీ చేసాడు. కాని అక్కడ యజమానికీ సేవకుడికీ మధ్య ఆత్మీయత మనకి అర్థంకాదు.

ఎందువల్లనంటే నేడు ఏ సేవకుడూ, ఏ కార్మికుడూ తన యజమానిలో ఆత్మీయతా అనురాగం చూడలేక పోతున్నాడు. పైగా అదే యజమాని తనక్రింది కార్మికులను విమర్శిస్తూ వీళ్ళకి పూర్వకాలంలో ఉన్న భక్తి శ్రద్ధలు నశించిపోయాయి. అంటాడు. వాడిమంచి చెడ్డలు మాత్రం తన కక్కరలేదు. ధర్మగ్రంథాలు వల్లె వేస్తాడు. చీమకైనా అపకారం తలపెట్టనంటాడు. తనక్రింద పనిచేసే వాడికి మాత్రం పట్టెడుమెతుకులు పెట్టడు. అందుకే ఈసమాజం వర్గ సామరస్య వాతావరణానికి దూరమయిపోయింది. ఇక కార్మికుడికి పోరాటం తప్పని స్థితి. అయితే; ఏది సమాజానికి మంచిచేస్తుందో చెప్పవలసిన సాహిత్యకారుడు కూడా ఆవేశంలో ఊగిపోతూ ‘పతితులార, భ్రష్టులార, బాధాసర్ప దష్టులార అంటూ కేకలు వేయసాగాడు. సాహిత్య లోకమంతా సమాజంలో ఒక పక్షానికి కొమ్ము కాయటం మొదలు పెట్టింది.

శ్రీశ్రీ తనకవిత్వంతో దగాపడ్డతమ్ముళ్ళని ఓదారిస్తే రాచకొండ విశ్వనాథశాస్త్రి తన కథల నిండా రత్నాలులాంటి దగాపడ్డ చెల్లెళ్ళకు బాసట నిలిచారు. రాచకొండవారిని గురించి కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు ఓ వ్యాసం వ్రాస్తూ ‘సంపదనూ అవకాశాలనూ సమానంగా పంచుకొని దోపిడీనీ దౌర్జన్యాన్నీ సమూలంగా నాశనంచేసి నవవ్య స్థని రూపొందించడానికి మార్క్సిజమ్ శ్రేయోదాయకమన్న పరిపూర్ణ విశ్వాసంతో తాపట్టిన కలాన్ని ఖడ్గంగా మల్చుకొని ఆదర్శం కోసం కారాగారం పాలైన ఆర్ద్రమనస్కుడు’ అని అంటూరు. అదేవ్యాసంలో మరోచోట ‘ఆయనొక సోషలిస్ట్, సిద్ధాంతరీత్యా ఆయనకు పేదలంతా మంచివాళ్ళు, ధనికులంతా చెడ్డవాళ్ళు’ అంటాడు. అందుకే సమాజానికి మార్గదర్శకులైన రచయితలకు ఆవేశం, తొందరపాటు, పనికిరా వంటాను.

'సూర్యుణ్ణి మింగిన చీకట్ని కోపంగా
దీపం బాకుతో పొడిచాను
గది అంతా వెల్తురు రక్తం.'

అనే ప్రతాపచంద్ర శేఖర్ గారి కవితలో అనోతరహా ఆవేశం కనిపిస్తుంది.

'ఆడుతు పాడుతు పని చేస్తుంటే
అలుపూ సొలుపే మున్నది?
ఇద్దర మొకటై, చేయి కలిపితే
ఎదురే మున్నది?
మనకు కొదువే మున్నది?'

అంటూ పాఠకులను ప్రబోధించి ఉత్తేజితుల్ని చేసే కొసరాజుగారు కూడా

'కళ్ళు తెరచి కనరా
సత్యం వళ్ళు మరచి వినరా
సర్వం నీకె బోధపడురా,
పట్టె మంచముల పండే వారికి
పరమాన్నము తిని పలికే వారికి
రక్తమాంసములు ఒకటే కదరా
హెచ్చు తగ్గులు పుట్టిక్కగ దరా'

అనే కవ్వింపు ధోరణిలోకి దిగవలసి వచ్చినది.

సంఘంలోని కూలివాని బ్రతుకును లోకానికి చాటుతూ ఎందరో యువ కవులు రచయితలు ఒక విధంగా తమ కర్తవ్యం నెరవేర్చు కుంటున్నారు. అన్నపురెడ్డి విజయభాస్కర రెడ్డిగారు తమ ఉగాది కవితలో

రాజధాని నగరంలో
రాజులు జరుపుకుంటే
ఉగాది పండుగ రాదు
అది ఉగాది పండుగే కాదు.
పల్లెనవ్వితే ఉగాది
పల్లె కోసను నిలిచిన
పూరిగుడిసె నవ్వితే ఉగాది
... ... ...
మేడి పట్టిన చేయి
కడుపు నిండితే ఉగాది
ఏతమెత్తిన మనిషి
బ్రతుకు పండితే ఉగాంది.

అని అంటారు. రచయిత బి. పాండురంగారెడ్డిగారు తమ ఖరీదైన న్యాయం మరియు 'న్యాయం ఖరీదు' అనే కథలో యజమానులమాట అలా ఉంచి కార్మికుడి మంచిని కోరవలసిన యూనియన్లు కూడా యజమానులతో కలసిపోయి న్యాయ వ్యవస్థని లంచాలపంచల్లో కట్టిపడేసి కార్మికుల నేవిధంగా కాల్చుకు తింటున్నారో చక్కగా వర్ణించారు. అలాగే నర్సాపేట వత్సలగారు తమ 'నిద్రగన్నేరు' కథలో నేడు యజమానులకు, పని వాళ్ళకూ మధ్య నెలకొన్న వ్యత్యాసాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు.

భూపతిరెడ్డి ఆవూరి మోతుబరి చలపతి రెడ్డిగారి కొక్కగా నొక్క కుమారుడు. మంగత ఆ ప్రక్కనే ఓ తండాలోని బాణావతు రామానాయక్ కూతురు. ఓ సుమూహూర్తాన ఆ ఊరికీ తండాకీ మధ్యలో మంగత భూపతి రెడ్డి బలవంతానికి లొంగిపోతుంది. అందుకు తండా నాయకు డామోతుబరి నడిగింది వాళ్ళ పిల్లని పెళ్ళిచేసుకో మనికాదు; బుంగసారాయీ, యాటా నలభై రూపాయలు రొక్కం. అందు కామోతుబరి పారేసినవి నాలుగుసున్నుండలు, నలభైచివాట్లూ.

ఇటువంటి ప్రస్తుత సమాజంలో లోపం ఎక్కడుందో నాగభైరవ గారు చక్కగా 'డిస్కవరీ' చేసారు.

'అంబరాన్ని అడిగాను
అంబుధిని అడిగాను
నేలను ప్రశ్నించాను
గాలిని గదమాయించాను.
నాదేశపు నైతికత్వపు
వెన్నెముకను విరుగ బొడిచిన
ఘాతుకు డెవ్వడూ అని
గిరుల్ని తరుల్ని విరుల్ని
దిక్కుల్ని చుక్కల్ని స్ఫురిల్నిక్కల్ని
సృష్టిలో గల చరాచర
జీవరాశి నంతటినీ
అడ్డదిడ్డంగా అడిగేశాను.
ప్రతివాడినీ నిలదీశాను.
ఆకాశం నవ్వింది
అంబుధి నవ్వింది
అవని ధ్రువ గళాలతో
అదే పనిగా నవ్వింది.
నాలో నేను చూసుకున్నాను
నయవంచకుణ్ణి కనుక్కున్నాను.

అంటే ప్రస్తుత సమాజంలో వ్యక్తి నిర్మాణం ఎంత అవసరమో తెలుస్తోంది. కల్లూరి భాస్కర్ గారు ఈ విషయం ముందే తెలుసు కున్నారేమో ... తమ 'మౌనం నాసందేశం' అనే కవితా సంపుటిలో,

'మానవుణ్ణి నడిపేందుకు
మరి ఏ వ్యవస్థా మిగల్లేదు.
అందుకని ఆఖరుగా
మౌనాన్ని ప్రవచిస్తున్నా'

అంటారు.

అయితే యిలా మౌనం ప్రవచించడం కూడా ఒకవిధంగా పలాయన ధోరణే అవుతుంది. పాతవ్యవస్థ కావచ్చు కొత్త వ్యవస్థ కావచ్చు. ఏవ్యవస్థలోనైనా సమాజంలో యజమాని, కార్మికుడు, అనే రెండువర్గాలు తప్పవు. వాటి మధ్య పోరాటమే శరణ్య మంటే ఇక మనిషికి శాంతి దొరకదు. కార్మికుడు బానిసగా పడివుండే ధనికస్వామ్యవ్యవస్థ మహా భయంకర మైనది. ఇక మిగిలింది ప్రాచీన మైందీ ఏదంటే కార్మికుడు తాను కార్మికుడి నను కునే పరిస్థితి తప్పించి యజమాని తనూ ఒకేకుటుంబ సభ్యులమనుకునే వాతావరణం కల్పింపబడటం. ఇరువురిమధ్య ఆత్మీయతా భావం, పరస్పర సహకారభావం వెల్లివిరిసినపుడు అది మహోత్కృష్టమైన వ్యవస్థగా రూపొందుతుంది. అదే శాంతి సంపదలు వెల్లివిరిసే ప్రాచీన భారతీయ వ్యవస్థ. అందుకు మనల్ని మనం ముందు సంస్కరించు కోవాలి. అందుకు సాహిత్యం దారి చూపాలి.

(ఇది ఖమ్మం గౌతమీ నవ్యసాహితి 'మేడే' సమావేశమందు చదవ బడిన వ్యాసము.)

# వందే మానసం

శ్రీమతి కమలాదేవి, ఎం. ఏ.

*సర్వ సంకల్ప సువికల్పసరసములకు
మోద ఖేదములకు రాగ మోహములకు
మనసు కారణ మనికదా మహితవాణి
కనుల కనరాకయే తానుకలతపరచు.

♦రమ్మర మ్మన్న చోటికి రాక గునిసి
వలదు వలదన్న దారికి పారిపోవు
వానరమువోలె చంచలవర్తి తాను
మంచిచెడ్డలు తెలిసియు మథన విడదు.

*వజ్రకర్కశమా నొక్క వ్యక్తియందు
వెన్న గా తోచు నొకరికి వింతగాను
వేడ్క చెందును దుఃఖించు విస్మయపడు
నవరసభరితగతులకు నాంది మనసు.

*నిత్యనైమిత్తికములకు నేత మనసు
కర్మ కల్లోలవిధులకు కర్తయగును
మనసుమంతవ్య మున్నచో మనిసిమనువు
ముఖ్యజీవన సారథి సఖ్యపరిధి.

♦వయసు సొగసును కులమతనియతి గనను
ధనిక నిర్ధన భేదముల్ కనను వినను
తారతమ్యము లెంచక తగవుదెచ్చు
మదికి నెమ్మది గూర్చిన మనిసి మనిసి.

*మనసు సంతృప్తి చెందిన మధురవేళ
భువన మంతయు పరచిన పూలపాన్పు
హృదయ మారాటమందుచు చెదరువేళ
ఎవరి ముఖములు చూచిన నేవగింపు.

*ఊహలో రాజ్యమభిషేక మొదవజేయు
కారుచీకట్లు తోపించు కలవరించు
స్వర్గనరకాళి సృష్టించి సరసమాడు
మనసుకన్నను శత్రు వీ మహిని లేదు.

*ముళ్ళబాటల మురియుచు త్రుళ్ళగలదు
మల్లెతోటల మూల్గుచు తల్లడిల్లు
ఆత్మబంధులతో రణమాచరించు
అలవిమాలిన వారలనాదరించు

*తన్ను మర్యాద చేయుచో తప్పుకొనును
తప్పుకొనువారికై తాను తరిమిపోవు
శ్రమ శరీరమునకు తెచ్చి రమణ చెందు
ప్రీతినోదార్చి లాలించు భీతి గూర్చు.

*ఉన్నయంతలో సంతృప్తి నొందనీదు
లేనిదానికై తహతహ పూని యడలు
వ్యథలు రగడలు నున్మాదకథల కెపుడు
మనసుకాణాచి శతవిధమార్గచారి.

*మనసులొంగదు అందదు మాట వినదు
మనవిచేసిన కెన్నెన్నొ మరులుగొనును
ఇంట మృష్టాన్నమున్నను ఇష్టపడక
పొరుగు పుల్లకూరను తిన పొంగిపోవు.

*ఈజగతి నిన్నగాథల కేమి కతము
ఈవగలు పగలును రేగ నేమి మతము?
ప్రియము నప్రియ మనిపించు భీతి పెంచు
హతము చెందును బ్రతుకుపై హాయినింపు.

*రాగ మోహ వినోద విరాగదశల
ఘనవిషాద చరిత్రలకర్త మనసు
వైద్యవిధులకు లొంగదు చోద్యముగను
మసను శాసించలేరు ధీమంతులయిన.

•నీడనిచ్చిన చాలని నిన్న తలచు
మేడ లెక్కగవలె నని నేడు వగచు
సైకిలుండుట సుఖ మని సంబరపడి
కారుకోరును కాంక్ష లగణ్యము లగు

♦పాప నడయాడ గాంచుట పరముదము
పెళ్ళి పేరంటములకు నపేక్షకలుగు
ముద్దుమురిపెములకు లేదు హద్దుపద్దు
మనుమలను చూచిమురియగా మనసుపడును.

♦శివుని సేవించ నాలుక చీరునొకడు
హరిని జపియింప శిరసును నరకునొకడు
ఒకరిమత మింపుగాదు వేఱొకరి కెపుడు
మనసుకలియక మాటలు మథన హెచ్చు.

*అలహిమాలయ మందున నిలయ మగుచు
పర్ణభక్షకులైనట్టి పరమఋషులు
చిత్తచాంచల్య జయమున చెదరినారు
వేదవేత్తలకైనను ఖేద మొసగు.

*మున్గినదె గంగ వలచినముదిత రంభ
భార్యరాకాసి పరసతి భాగ్యవల్లి!
తనకలిమి పుర్వ మొకరిది దస్యధనము
మనసు తోపింప చేయని మాయ లేదు.

*బిడ్డ వాకిటపోయిన భీతిగాంచు
రజ్జుసర్పముగా నెంచి రగడజేయు
అలవిమాలిన కల్పన లల్లుకొనును
ఆశలెన్నెన్నొ పెంచును ఆత్రమిడును.

♦తనకు నధికారపూజిత ఘనతగాంక్ష
ఒరుల యవిధేయతల నెప్డు నొప్పుకొనదు
ప్రణయవిరహిత మైనచో ప్రాప్తమనును
పరులకైన స్వయంకృతపాప మనును.

*స్వీయపాండిత్య ధీరత న్యాయమనుచు
ఎదిరి వాఙ్మయసంపుటి నియ్యకొనక
వాదభేదము కల్గించి ఖేదపడును
మనసు కల్పించలేనిది మహిని లేదు.

*మౌనరాశిగ తా నుండి మహిమజేయు
మాటచేతల ప్రేరణమీట తాను
వెల్లిపరచును నింపును వీప్సగొల్పు
గారడీ చేయగలదు షికారిమనసు.

*నిత్య సంతుష్ట మానసనేత లెవరొ
వారె భువిపైని సిసలైన ప్రౌఢులరయ
జగతి శాసించ నేర్చిన జాణకన్న
మనసు శిక్షింప తెలిసిన మనిసి మిన్న.

♦సకలవిశ్వాసములకును సరసములకు
స్మృతి వినోదములకు సుఖగతులకైన
మనసుకారణ మనుమాట మఱవతగదు
వందనము చేయవలయు నా డెందమునకు.

*మనసుబాధలు తీర్చగమందు లరుద
తనువుసొలసిన సుఖపెట్టుదారి గలదు
భక్తి సంరక్తి శక్తి విభక్తులకును
మనసు మూలవిలోలము మహితబలము.

## తత్త్వమ్

- శ్రీ రాణి శివశంకరశర్మ.

*మృత్తునుండిగాదె మృద్భాండముదయిం
నావిధమ్ముగానె యఖిలజగము
బ్రహ్మనుండి వచ్చిబ్రహ్మలోనుండును
వెదుక నేల నీవు నదియె కాగ

*నీవె యాత్మవురాగన్
గోవిందుని వెదుక నేల? కోవెలలోనన్
నీవొక చిన్నదబిందువ
వావిషయము తెలియు మేల
అన్వేషణముల్.

*తరుణీచేష్టలు నిగ్రహ
తరణిని తరలించు దుడుకు తరగలు
ధరణిన్.
తరుణపు తరళత్వమ్మును
తరిమినచో సరళమగును తరియించుటిలన్.

— ... —

( 12 వ పేజీ తరువాయి )

*శబ్దశాస్త్రజ్ఞులకు మది సమవినోది
ఉభయలింగములను లేక సభయమగును
మనసు చొరరాని తావులు మహిని లేవు
వేగగామిని బంధుగు విశ్వమునకు.

* దైవసన్నిధిచేరియు తపనవిడదు
ధైర్యసాహసముల నిచ్చు, దైన్య మిచ్చు
నిత్య మన్వేషణముచేయు నేర్పుగలుగు
మనసు నానందమే జీవ మధురఫలము.



## యోజనగంధి - ప్రయోజనగంధి

- (భారతీప్రియ) శ్రీ ఎం. సత్యనారాయణమూర్తి, ఎం. ఏ.

మనలో చాలమందికి వ్యాసమహర్షి జన్మవృత్తాంతం తెలియనే తెలియదు. తెలిసినవారికి కూడ చెప్పడానికి సిగ్గు పడేవిధంగా ఉం దనిపిస్తుంది. సత్యవతి అనే మత్స్యగంధి అంటే చేపకంపు కొట్టే స్త్రీయొకతె పడవ నడపుకొంటూ ఉంటే పరాశరుడు అనే మహర్షి ఒకనాడు పగటిపూట ఆ పడవఎక్కి, ప్రయాణంచేయడానికి వచ్చాడు. అందరి లాగే అతనూ పడవఎక్కాడు. కాని అందరిలాగే ఊరికే కూర్చోలేదు. సత్యవతి అంద చందాలు ఆశగా చూశాడు. ఆమె మత్స్యగంధి అనే ఊహ అతనికి రాలేదు. ఆమె అందం చేపజాతి చందం అనిపించలేదు. ఆమెను సూటిగా అడిగాడు తనతో ప్రణయానుభవం పొందమని. ఆమె అన్నదిగదా 'నాశరీరం చేపకంపు కొడుతున్నది నన్నెట్లాసహిస్తావు. అని. ఆయన వెంటనే ఆమెకు యోజనగంధిగా వరమిచ్చాడు. ఆమె యొడలి నుండి దివ్యసుగంధం యోజనదూరం వ్యాపించేదిగా వెలువడింది. ఆమె అంటుందిగదా. ఇక్కడ నలుగురూ చూస్తున్నారు. మరి మన ప్రణయం కొనసాగే దెలా? ఆయన చెప్పాడు. 'పడవను యమునా ద్వీపానికి చేర్చు'మని. పడవను చేర్చి పడతి అడుగుతుందిగదా 'స్వామి! ఇది పగలు సంగమం సాధు సమ్మతమేనా? అని. ఆమహర్షి అకాల అంధకార ఆవరణ కల్పించినాడు. ఆ వేళావిశేష మేమో కాని వెంటనే సద్యోగర్భ సంజాతుడై వ్యాసమహర్షి ఉదయించినాడు. తల్లి దండ్రులకు నమస్కరించి తపస్సునకు పోయినాడు. తల్లికి ఎప్పుడు స్మరిస్తే అప్పుడు వచ్చి కనిపిస్తా నని మాటయిచ్చి వెళ్ళాడు. సత్యవతి తనకెంతో అన్యాయం జరిగిందని వాపోయిందా? లేదు. ఆమె కన్యాత్వం చెడకుండా పరాశరుడు అనుగ్రహించాడు. పరాశరుడు అధర్మమాచరించా నని బాధపడలేదు. ఉత్తమ సంతానంకన్నానని తృప్తి చెందాడు.

తల్లి తండ్రీ తప్పు అనుకోని వ్యాసుని జన్మవృత్తాంతం గురించి మనం ముక్కుమీద వేలు వేసుకుంటాం. తప్పులెన్ను వారు తండోపతండంబు. తప్పులెన్నడం తప్ప మనకు చేతనయిన విద్యలేదాయెను. ఒక సంఘటన తప్పో ఒప్పో అన్యాయమో, అధర్మమో ఫలితాన్నిబట్టి కుండ బద్దలు కొట్టినట్లు తెలిసిపోదా - పరాశరుడు చేసినపని మనలో చాలమందిచేయగలరు. కాని వ్యాసుని వంటి కుమారుని ఎంతమంది కనగలరు. మన పెద్దరికంలో మనమాటవిని మనకు కాలు చేయాడని వార్ధక్యంలో సేవచేయగల పిల్లల నైనా కనఁగలుగుతున్నామా? మరి వ్యాసుడు చూడండి. కన్న తండ్రి తనదారిన తాను పోయాక, కన్న తల్లి మరొక (శంతనునితో) పెళ్ళిచేసుకొన్నా, తన కోడళ్ళు విధవరాండ్రయి, వంశనిర్మూలన, మవుతున్నపుడు మరొక కొడుకు (భీష్ముడు) తనస్వార్థమనే ప్రతిజ్ఞగా భావించికొన్నపుడు, సత్యవతి తన పూర్వపుత్రుడైన వ్యాసుని స్మరిస్తుంది. అతడు తత్క్షణమే సాక్షాత్కరిస్తాడు. అతనినివిధవరాండ్రయిన అంబిక - అంబాలికలతోఁ గూడిసంతానం కనమంటుంది ఆ తల్లి. అతడు ధర్మసంకెళ్ళు వల్లెవేసాడా? లేదు. తత్క్షణమే తల్లిఆజ్ఞ ఆచరించి అలాగే వెళ్ళిపోయాడు. అతని వల్లనే కదా ధృతరాష్ట్ర పాండురాజులు జన్మించారు. వారివల్లనేకద కురుపాండవులు పుట్టి భారత కథ

నాయకులయ్యారు. ఓహో యోజనగంధి ఎంతటి ప్రయోజన గంధి అయినది.

'తల్లియనిననట్లు తనయుం డనిన నట్లు
నుండవలయు గాదె యుర్వియందు'

ఎవరీతల్లి? మనతల్లి అయినచో బాగుండునా? ఛీ యనిపించదా? మన తల్లిఅయినచో ఏమిచేయగలిగి యుందుము? ఏదో చేసినచో మనబ్రతుకు కర్ణుని బ్రతుకువలె అపకీర్తి తప్ప ఉపకారము లేకుండ పోయెడిది. వ్యాసుడే మియు చేయలేదు కనుకనే వేదవ్యాసుడుగా సమస్తజాతికి వేదవిజ్ఞానమును విభాగించి ఇచ్చిన వాడయినాడు. వేదార్థములను సమన్వయ పరుచు బ్రహ్మసూత్రము లల్లిన వాడయినాడు. సృష్టిజరుగుటలోని వివిధ దశలను అష్టాదశపురాణములుగా దర్శింపగలిగినాడు.

కృష్ణద్వైపాయనుడు అను సార్థక నామముతో తనవంశ చరిత్రనే భారత ఇతిహాసముగా లోకమునకు అందించ గలిగినాడు. తన అనుభూతినే భగవద్విభూతిగా భాగవత రచనచేసి జీవుల నను గ్రహించినాడు. మన మీజన్మకు కాదు గదా. వేయి జన్మలకైనను ఇంతటివారము కాలేము. కాగలయుపాయ మొక టున్నది. అది ఆమహర్షి జన్మవృత్తాంతమును మరొకసారి శ్రద్ధగాచదివి మననముచేయుటయే. ఇట్టి సదుపాయము కొరకే అతడు తానయి తనజన్మ కథను భారతాదిని చెప్పుకున్నాడు. మనలో ఎవ్వరికి ఇంత గుండె దిట్టతన మున్నది? మన తల్లిదండ్రు లెట్టి వారైనను వారిని గౌరవించి నమస్కరింపగల సంస్కారము మనకు అలవడినచో వ్యాసుని అనుగ్రహము మనకు లభింపగలదు. అప్పు డతని జన్మవృత్తాంతము నందలి ఆంతర్యమును అనుభవమునకు రాగలదు.

సత్యవతి అనగా సత్య వతి సత్యము కలది. అనగా సమస్త సత్యములతో నిండిన ప్రకృతియే. ఈ ప్రకృతిలో భూమి మొలకెత్తించుట, జలము ప్రాణముపోయుట, అగ్ని జీవింప జేయుట వాయువు ఆహారముగా నుండుట, ఆకాశము నివాసస్థానమగుట మొదలగు పంచ భూతముల ధర్మములన్నియు నిత్యసత్యములుగా వర్తించును. అవి సజీవములైన చెట్లలో, జంతువులలో, మానవులలో ప్రవర్తించుట మనము చూచుచునే యున్నాము. ఇట్లు ప్రకృతి సత్యములు ప్రవర్తించు జీవుని స్వభావమే సత్యవతి ఇప్పటికీనీ అర్థమగుట కొంచెము కష్టమైనచో మరికొంత వివరణము. మనకంటికి వస్తువు కనిపించుట సత్యము. చెవికి ధ్వని వినిపించుట సత్యము. చర్మమునకు స్పర్శ తెలియుట సత్యము. నాలుకకు రుచి తెలియుట సత్యము. ముక్కునకు గాలిలోని ప్రాణవాయువును స్వీకరించుట సత్యము. ఈ సత్యములు ప్రవర్తింపని నాడు, కనులు కనబడక, చెవులు వినబడక, చర్మము మొద్దుబారి, అన్నము రుచింపక, గాలియాడక, చనిపోవుస్థితి యుండనే యున్నది. కనుక ఈ సత్యములు ప్రవర్తించునప్పటి మన జీవ స్వభావమునకు 'సత్యవతి' అని పేరు పెట్టినచో మనము అభ్యంతర పడనక్కఅలేదు. అట్టి మన ఆత్మజ్ఞానము లేక (సత్యవతి)కికూడ తన జన్మవృత్తాంతము తెలియదు. సత్యవతి ఉపరిచర వసుమహారాజు పుత్రిక. వసురాజు అనగా జీవులుగా వసించు పరమాత్మలక్షణం. అట్టిలక్షణమువలన ఏర్పడిన దేహస్పృహగల జీవియే మత్స్యగంధి. జీవనస్పృహమాత్రమే కల్గి కాలమను యమునానదీప్రవాహమునందు దేహమను పడవలో ప్రయాణంచేయు చుండుదుమని చెప్పినచో నేమి యభ్యంతరము? ప్రాణమున్నంతవరకు జీవస్పృహయొక్కటే తెలిసిన మనము నీళ్ళలోపుట్టి పెరుగు చేపలకంటే విశేషప్రవృత్తిగలవారమా? అని ప్రశ్నించు కొన్నచో సమాధానమేది? నీళ్ళుప్రాణమునకు చేపజీవికి సంకేతములుగా గ్రహింప గలిగినచో యందున్నది చేపలక్షణమేకాదా గంధి యనిన నింతియేకదా! గం కంపుకాదు. ఆ జీవిలక్షణము. మనము వానివాసన వీనికి గూడ సో వీడు పేకాటమరిగినాడు. అని అందుము కదా! పూర్వజన్మ వాసనలు అందుము వాసనముక్కుకు తెలిసిన వాసనకాదు గదా. అప్పటిజీవలక్షణము. అట్లే 'మత్స్యగంధి' అనుపదమునుకూడ అర్థముచేసుకోవలెను. మత్స్యము నీళ్ళల్లో ఉన్నంతవరకు జీవస్పృహకలిగి నీరువెడలి నంతనే చనిపోయినట్లే, ప్రాణమున్నంతవరకు జీవస్పృహ కలిగియుండు దేహధారి జీవలక్షణము మత్స్యగంధిగా సంకేతముచేసి చెప్పబడినది.

ఇట్లు ఏజాతి తల్లిదండ్రు లిచ్చిన శరీరవముతో ఆ జాతి జీవస్పృహకలిగి ఎన్ని జన్మలం గడిచిన ఏమిప్రయోజనము. అట్టివి ఎన్నోమానవజన్మలైనచో ఎంత నిష్ప్రయోజనము? కావున మానవునకు వాక్కు ఇవ్వబడినది. ఆ వాక్కుతో నతడుగురువు వద్ద విద్యాభ్యాసము చేయును. అప్పుడు మత్స్యగంధిలక్షణముపోయి యోజనగంధి లక్షణ మబ్బును. తాను నేర్చిన విద్యాజ్ఞానముతో నతడెన్ని యోజనములైనను జీవితమున పయనించునుగదా. అతడు తన విజ్ఞానమును 1) ఎన్నో విధముల విభజించుకొనును.

2) తన జీవిత విధానమునకు తగినసూత్రములను అల్లుకొనును. 3) తన యవసరము కలిగిన చోటికి పోయి అజ్ఞానజ్ఞానమార్గములలోసముచితవిధముగాప్రవర్తించును, 4) తాను తల్లి గర్భమున పడినప్పటినుండి, భూమిమీద పడినప్పటినుండి. నిర్ాణము

...కు పొందిన దశలన్నియు ...వతారములే యని అను ...వ్యాసుని 1) వేదవిభా ...గ్రంథరచనము 3) భారత ...వతరచనము ఇవి వ్యాస ... ఇంత విద్యా విజ్ఞానముల ...ఖమునకు మూలకారణము వాక్కు కదా! ఆ వాక్కు మన యందు నాలుగు విధములుగా పనిచేయుచున్నదని జాగ్రత్తగా పరిశీలించినచో తెలియును. అవి వెనుకనుండి 4) మనము మాట్లాడుమాట (వైఖరి) 3) మనము మాట్లాడదలచిన మాట (మధ్యమ) 2) మనము మాట్లాడ వలసిన అంశము (పశ్యంతి) 1) మనము మాట్లాడవలసిన అంశము మనకు తెలియ కుండనుండుట (పరా) అను విధముగా నుండును. వీనినే సక్రమముగా మన పెద్దలు పరా పశ్యంతీ, మధ్యమా, వైఖరు లని చెప్పినారు. ఇట్లు చెప్పబడిన 'వాక్కు' యొక్క ప్రప్రథమ 'పరా' స్థితియే పరా శరుడు అను మహర్షిగా చెప్పబడినది. అనగా మనకు సంస్కారవంతమైన వాక్కు నేర్పు గురువు అని తెలుసుకోవ లెను. అట్టి గురువుఅనుగ్రహముచేత మన లోని సత్యము మనకు తెలియును. మన నుండి విజ్ఞానము వెలువడును. ఇదియే సత్యవతి విజ్ఞానఖనియైన వ్యాసుని కనుట.

విద్యావిజ్ఞానములు సంపాదించి, సంస్కారవంతులమైన మనము, మనస్స్వచ్ఛత కోల్పోవకుందుముగదా. కోల్పోవ కుండ విద్య బోధించు గురువు మన కున్నచో కోల్పోవకుందుము. దీనినే గర్భ ధారణ జరిగి వ్యాసుడు పుట్టినను సత్యవతి కన్యాత్వము (మనఃస్వచ్ఛత) చెడలేదని కథగా సంకేతము చేయబడినది. గురువుల సన్నిధిలో విద్యాబోధన, విజ్ఞానధారణ పూర్తియైనవెంటనే లోకోపకారకమైన పనులలో ఉద్యోగులుగా వారి శిష్యులు చేరుట మనము చూచుచునేయున్నాము. ఇదియే సద్యోగర్భ జననము. ఇంతయను భవము కలిగి సద్యోగర్భమెట్లు కలుగునా యనియు, సద్యోగర్భ సంజాతు డెట్లగు ననియు సందేహ పడుట ఎంత హాస్యాస్ప దము? ఆ చెప్పినది మనవంటి తల్లిదండ్రుల విషయము కాదుగదా! సంస్కారశీలురైన విజ్ఞానవేత్తలను సమాజమున కందించు గురుశిష్యుల కథలు గదా అవి. ప్రకృతి లోని నిత్యసత్యముకదా, సత్యవతీ పరా శరుల ప్రణయ సంయోగము. అది దేహ ధారియైన జీవుని దేవునితో కలుపుప్రణవ యోగము కదా. మనముకూడ సత్యవతి స్వభావము కలవారమగుటచేత పరాశ రుని, యనుగ్రహము పొందుదుము గాక.

ఈ వ్యాసకథన స్మరణముచేత మన మును వ్యాసజన్మమును పొందుదుముగాక.

—0—

## తపః ఫలము

శ్రీ ఎం. సుమిత్రాకృష్ణ, ఎం. ఏ.

*పూర్ణ రాకాశశాంకుని బోలు కాంతి
విరచిత తనూ విలసనాన పరిచయాన
నాటి నడిరేయి పున్నమినాడు నాకు
ప్రేయసి యొకర్తు కనిపించె ప్రేమమీర.

*నూతన మా విలాసము మ
నోగత భావ విహాయసాత్ఫ్కలితో
పేత విశేషదిక్కరణ
విస్తృత నవ్యమనోహరాకృతిన్
చేతము నాక్రమించె గదా
జిన్మయ దీపిత దృగ్విలాస సం
పూత కిరణ్మయాళికిని
బొంగెను నాతను పున్నతంబుగన్.

*మానసము న్గదల్చి విసు
మానవమలంకృతిఁ జేసి నిర్మలా
హ్వానము చూపులం దిడుచు
హా! ప్రియభావకవిత్వ శేఖరా
గానము చేయు మింక నయ
గారవు వాగ్ఝరు లొప్ప నూత్నమై
ప్రాణము చిప్పిలంగ ఘన
భావ సుధామయ రమ్యరీతులన్.

*అంచుఁ బలుకంగ ఏనుడులా మెగూర్చి
మాటలాడితినో? ఏమొ? నోటమాట
లేదు కనులు మూతవడుట కాదు కాని
చెవుల గుసగుస ల్వినబడె చేతనముగ.

* నా కమనీయ రూపమును
నాకవిలాసిను లొల్లకుండగా
ప్రాకట వైభవాన ఘన
భాసుర సుందర శబ్ద నిర్మితం
బాకలితంబునై వెలయ
నాద్యట పాటలుగా రచింతుగా
నీ కవితా సుధామయ వి
నీత వినూత్న విశేష భావనన్.

*చాలుగదోయి ప్రేమికుడ!
శాశ్వత ప్రేమకు చిహ్నితంబులా
నాలుగు పాటలందు నను
నాల్గు యుగాలకు నిల్పినావు నీ
లాలిత నర్మగర్భ కృతిలాస్య
విధాన విశేష పాండితీ
పాలన మింతకాలమును
పండిన దిట్లు మహాద్భుతంబుగన్,

*కాళిదాసుని కావ్య గుణాళివోలె
నీముఖార్పితములయిన నేటిమాధు
రీ భరిత నూత్న భావనారీతిఁ దలప
మై పులకరింత లుదయించె మానితముగ.

— ... —

## ప్రజగీతి

-శ్రీ * * *

* కన్నుమోహమైన నీకయి కలత చెంది
మరల చూచెడి వేళకై మథనపడితి
ఎదుట నున్నపు డేమియొ ఎగ్గులోచు
నిన్ను చూడక నామది నీరసించు.

*రాధికా ప్రాణరక్షకా రమ్యకృష్ణ!
రాగరాజీవ పూజలు రక్తిగొనుము
అల్లరివి కల్లరివి నీవ అతులితముగ
నన్నుదోబూచు లాడించు వన్నెకాడ!

*వెన్నెలలు వేడిలోచె నీ ప్రేమలేక
సంఘధర్మాలు మీరగా శక్తిలేదు
భావ శబలత నన్నిక బ్రతుకనీదు
వ్యర్థ జీవిని చేయకు వ్యాసశీల!

* మురళిఊదిన వికసించు మోడులైన
మనసు నిలువదు నాకు నీమాయచేత
పురిని విప్పిన నెమలిగా పరుగులిడుదు
గోపకాంతలు నిను చేరు గోము తెలిసె.

*రక్తి రమ్యానుభూతి కర్థములు నీవె
గాన మోహన! సౌందర్యకలితవదన!
నిస్తులానంద కారణ నీరజాక్ష!
కన్నెమదులను దోచిన వెన్నదొంగ!

*ఏమి నిగర్వ వర్తన మ
 దేమి మనోజ్ఞ వచస్సు మాధవా
కోమల సౌమ్యరూపగుణ
 కోవిద! గోపవిశిష్టరత్నమా!
ఈమధురాకృతిన్ రమణ
 ఏ మహితాత్మకు సొంతమౌ దొకో!
క్షేమములిచ్చు నిత్యనవ
 జీవన భవ్యయశోనిధానమా!
*శృతి సరిలేని వీణను హ
 రీ! నను నెట్లు తరింపచేయుదో
వితరణ రమ్యశీల! సుఖ
 వీక్షణ సత్యవినోద నెచ్చెలీ!
బ్రతుకున కాంతి నింపు నవ
 భావమహోదయ జీవనాంశమా!
సతతము ధన్యవాదములు
 సల్పుదు నీకు! ముదావహంబుగన్.

—...—

# ఈ పక్షంలో

25-10-81 తేదీ ఆదివారం సాయంకాలం 6-30 గం॥లకు రాజమండ్రి శ్రీవెంకటేశ్వర ఆనంకళా కేంద్రంలో మయూరికళాకళాసమితివారి 'నిరుడుకురిసిన హిమసమూహములు' కార్యక్రమపరంపరలో భాగంగా నిట్టల సోదరుల బుర్రకథ కార్యక్రమంజరగినది. నర్తనశాలకథ చెప్పబడునవి ప్రకటించడం జరగినది. కాని ఉత్తరగోగ్రహణంకూడా చెప్పడం జరగింది.

కథకులు ఆంధ్రరాష్ట్రంలోనూ ఇతరత్రాకూడా పేరుప్రతిష్ఠలు పొంది రాష్ట్రపతి అవార్డును కూడ సంపాదించినవారు. కథాకథనరీతి అతి సంక్షిప్తమై; అంత రమణీయముగా లేదని చెప్పవచ్చును. హాస్యప్రసంగములు పేలవములై, నాగరక సమాజదూరములై యున్నవి. బుర్ర-కథావిధానమును శాస్త్రీయతకు దగ్గరగా తీసికొని వెళ్ళదలచిన వారిలక్ష్యసిద్ధి కవిదోహదము చేయగలవని భావింపలేము. కళాత్మకంగా ఉండవలసిన ఇట్టివానిలో మహోన్నతపదవులలో వున్న రాజకీయ నాయకుల పేర్ల ప్రసక్తి, వారిని పరిహసించేవిధానము ప్రదర్శించినతీరు హుందాతవముగా లేదు. సమాజంలోని వివిధ-తరహాలవ్యక్తుల మనస్సును నొప్పించే హాస్యం ఉత్తమం కాజాలదు. కథకులు ఉపాధ్యాయులు తెలుగు పండితులూ అయినందున ఉచ్చారణరీతి, ఆహార్యకము చక్కగా నున్నవి. హాస్యాదిక విషయలలో అతి తగ్గించిన ఎంతో రమణీయంగా ఉండెడిది. జానపదకళలంటే తేలిక భావం కలగనీయక నాగరకస్థాయికి ప్రతిబింబగా మలుచుట అభిజ్ఞులయిన కళాకారుల కర్తవ్యం.

—...—

## గ్రంథసమాలోచన ;

బాలగే

రచయిత : డా. ఎ
ఎం. ఏ., పిహెచ్.డి.
50 పుటలు. వెల రు 5.
ప్రచురణలు, C-73
గుంటూరు.]

ఈబాలగేయాల్ని రచించిన శ్రీ డా. యస్.గంగప్పగారు బహుగ్రంథ రచయితలు, పరిశోధకులు. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో పిల్లలు కొత్త సంవత్సరం వేడుకలు జరపుకుంటూండగా చూచిన ఉత్సాహంలో 'అందమైన బాలలం' రచించి తర్వాత ఈ గేయాలన్నీ వ్రాసిరి.

పిల్లల వివిధ సంశయాలకి కొంతవరకు సమాధానంఇస్తూ విజ్ఞానం, ఆనందం కలిగించే ఈ గేయాల ప్రాశస్త్యాన్ని ప్రయోజనాన్ని ముందు మాటలో ఆచార్య శ్రీ దోణప్ప ఎం.ఏ.,పిహెచ్,డి. -గారు వివరించి ప్రశంసించియున్నారు.

అందమైన 'బాలలం' కంటె 'పిల్లలం' అనడం ఎక్కువ జాతీయంగా కన్పిస్తుంది. బహువచనంలో బాలలు శబ్దం ఇంతవరకు వెలువడిన ఏలక్షణంచేతనూ ఉభయలింగశబ్దంగా సాధింపబడలేదు. శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారైనా దీనిని సాధించినట్లు తోచదు. అయినా బాలబాలికలు అనే అర్థంలో ఈపదం బహుళ ప్రచారంలో ఉండడంవల్ల అంత ఎబ్బెట్టుగా లేదు. చాలవరకు అతి సరళమైన పదాలతో సులభసుందర భావాలతో ఈ గేయాలు కూర్చబడ్డాయి. పిల్లలుఉత్సాహంతో చదవడానికి పాడుకొనడానికి వీలుగా ఉన్నాయి.

'అమేయజ్ఞానమానిసమధిష్ఠిత తపోవనాలు
అనంతప్రపూతహోమాగ్నిధూపమాలికలు
సర్వజాతిమత సంస్కృతి సమ్మేళనాలు.'
 12 పే.

వంటిపంక్తులూ, ఆనందంపుఅర్ణవాలు, అంకితం, మేఘోజ్ఞానం 16 పే. ఒకటెంబడి ఒకటి 45 పే. నిముషంలో దరహాసం 40 పే. వంటి పదాలూ! ఈ 'బాలగేయాలు' గ్రంథంలో చోటుచేసుకోకుండాఉంటే బాగుండేది. -శ్రీ గౌతమ.